First Edition · 5000 Copies
July, 1959

# PLATO'S DIALOGUES
## Apology & Crito

Translated by
*Pilaka Ganapati Sastri*

Published under the auspices of
The Southern Languages Book Trust

**Price Rupee One**

Publishers
GUNDIMEDAS
Powerpet :: Eluru

Mumukshuvu Mudranalayamu, Eluru.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపచేసింది. ఆ ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్లు పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందు వల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘన కార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం ఆ మహా పురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం - ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభి వర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటక కళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షి ణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాస దాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆ విధంగా ఇట్టి ప్రచు రణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడి నప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తి గల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞాన పిపాసను తృప్తిపరచ డానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగల వని ఆశిస్తున్నాను.

మద్రాసు
7 వ అక్టోబరు, 1958

ఇట్లు,
ఎ. లక్ష్మణస్వామి ముదలియార్
వైస్ ఛాన్సెలర్ -
మద్రాసు విశ్వవిద్యాలయం

# సోక్రటీస్
# అమరవాణి

---

ప్లేటో ప్రసంగాలనుండి

సమర్థన

క్రిటో

# ప్రవేశిక

క్రీస్తు పూర్వం అయిదవ శతాబ్ది ప్రారంభంలో ఏథెన్సు నగరం ఇప్పుడు మద్రాసులోని తిరువళ్ళిక్కేణి కంటె పెద్దదీకాదు; అంతకన్న ప్రసిద్ధ మయినదీ కాదు. కాని ఆ నగర పౌరుల శక్త్యుత్సాహాలు ఒలింపస్ పర్వతం పై వీచే మహా మారుతాల వలె విశృంఖలంగా సాగిపోయాయి. క్రీస్తు వెనుక అయిదవ శతాబ్దం ప్రారంభంలో ఒలింపస్, మరాథాన్, సలామిస్ మహా సంగ్రామాలు చెలరేగాయి. అవి గ్రీసుదేశీయుల మహా పౌరుషోత్సాహాలకు తార్కాణాలై చరిత్రలో నిలిచాయి. ఆ యుద్ధాలలో పెర్షియా మహాసామ్రాజ్యం నేలమట్టమయింది. ఒక చిన్న పట్టణంగా ఉన్న ఏథెన్సు ఒక రాజ్యమై, క్రమంగా ఒక మహా సామ్రాజ్యానికే పట్టుగొమ్మగా మారింది. అసూయా ద్వేషాలు, అసమగ్ర పరిపాలన క్రమక్రమంగా ఆ సామ్రాజ్య పతనానికే హేతువులయ్యాయి. ఆ శతాబ్దం తుది భాగంలో ఏథెన్సు సామ్రాజ్యం ఛిన్నాభిన్న మయిపోయింది. గ్రీసు రాజకీయౌన్నత్యంతో బాటు మహత్తరమయిన నౌకా బలంకూడా నశించిపోయింది. ఆ శతాబ్దం చిట్టచివరి భాగంలోనే సోక్రటీస్‌కు మరణశిక్ష విధించడం జరిగింది.

జాజ్జ్వల్యమానమైన ఏథెన్సు నగర వైభవం సమస్తము సోక్రటీస్ కళ్ళారా చూచాడు. మాతృదేశోన్నతికై సాగిన పోరాటంలో అతడొక ప్రముఖ యోధుగా నిలబడ్డాడు. ఈనాటివరకు ఆయన ప్రతిష్ఠ నిలిచిఉంది. అంతేకాదు. సోక్రటీస్ తాత్విక సిద్ధాంతాలే పాశ్చాత్య నాగరకతకు మొట్టమొదటి పునాదులైనాయి.

సోక్రటీసెన్నడూ స్వయంగా నాలుగు వాక్యాలు రచించలేదు. చర్చా రూపంలోనే ఆ మహనీయుని తాత్త్విక బోధ కొనసాగింది. విపణి వీధులలోను, రాజమార్గంలోను, వ్యాయామ రంగాలలోను, మిత్రులతో కలసి ఇష్టాగోష్ఠి సాగించేవాడాయన. ఏదో మాట వరస కన్నమాటమీద

మాటలాని క్రమక్రమంగా ప్రధాన నైతిక సిద్ధాంతాలపైనే చర్చలు జరుగుతూండేవి. ఇంకా న్యాయ స్వభావము, సౌశీల్యము, సద్గుణాలు ఆత్మ అమరత్వము, పరమేశ్వరాస్తిత్వము, ఉన్నత ప్రభుత్వము మొదలైన శాస్త్రాల్లో ఆ చర్చల్లో ప్రాముఖ్యంగా ఉండేవి.

సోక్రటీస్ పద్ధతి లోకానికి సహజంగా కొందరు శ్రోతలను చిరాకెత్తిస్తూండేది. తానొక కందిరీగలాంటి వాడినని ఆయన అంటూ ఉండేవాడు. అనైతిక ఆల్సిబియాడిస్ లాంటి, క్రిటియాస్ లాంటి వారితో సన్నిహితంగా ఉండటం వల్ల సోక్రటీస్ కు శత్రువులు ఎక్కువయ్యారు. కొంతవరకు ప్రతిష్ఠ కూడా తరిగింది. ఈ వ్యక్తి సిద్ధాంతాలే ఏథెన్స్ పతనానికి ప్రముఖపాత్ర వహించాయన్నే అప్రతిష్ఠ ఏర్పడింది. సోక్రటీస్ ఏథెన్స్ ప్రజాస్వామ్యం సరిగా సాగడం లేదని నిశితంగా విమర్శించేవాడు. అందుచేత ప్రజాస్వామ్య పక్షీయులు అతని విచారించి శిక్షించాలని నిశ్చయించారు. దేవతలపై శ్రద్ధ విశ్వాసాలు లేకుండా చేస్తున్నాడని, యువకులను చెడగొడుతున్నాడని, సోక్రటీస్ మీద రెండు నేరాలారోపించారు. ఆ విధంగా ఆరోపణలు చేసిన వారతనికి మరణశిక్ష విధించాలని కోరారు. చిట్టచివరకి సోక్రటీస్ కు మరణ దండన విధించారు. ఆ రోజుల్లో న్యాయశాస్త్ర సంప్రదాయాన్ని అనుసరించి, విధించిన శిక్షకన్న కొంచెం తక్కువ శిక్ష విధించవలసినదని అడగడానికి నిందితులందరికీ హక్కుండేది. ఆ హక్కు సోక్రటీసుకు కూడా దక్కింది. కాని ఏథెన్స్ వాసులందరికీ తానెన్నో విధాల ఉపకరించానని ఆయన భావించాడు. దీనిలో అహంకారమేమీ లేదు. కనుకనే ప్రభుత్వం తన స్వేచ్ఛా జీవితానికి, గౌరవభృతికి, తగిన ఏర్పాటు చెయ్యాలని అర్థించాడు. ఈ ప్రార్థనలో దురహంకారమేమీ లేదు. కాని ఫలితమేమీ కనబడలేదు. చివరకు మరణశిక్షే ఖాయపడింది.

సామాన్యంగా అలాంటి శిక్ష విధించిన ఇరవై నాలుగు గంటలలోనే అది అమలుచేస్తారు. అయితే ఆ సమయంలో ఏథెన్స్ నగరంలో ఒక మహోత్సవం జరుగుతూ ఉన్నది, డెలోస్ నుంచి ఏథెన్స్ నగరానికి ఒక ఉత్సవ నౌక వచ్చినప్పుడే ఆ మహోత్సవం పరిసమాప్త మవుతుంది. ఇందువల్లనే ఆ సమయంలో సోక్రటీస్ కు విధించిన శిక్ష అమలు పరచలేదు. ఆయన మరొక నెలవరకు ఖైదులోనే ఉండిపోయాడు. ఆ నౌక చేరుకొన్న

# ప్ర వే శి క

సమయానికి సోక్రటీస్ మిత్రులతో కలిసి ఆత్మ అమరత్వంపై చర్చలు కొనసాగిస్తున్నాడు. ప్లేటో ఆ చర్చలన్నీ "ఫీడో" అనే ప్రసంగంలో పొందు పరిచాడు. ఆ చర్చ ముగిసిపోగానే కారాగారాధికారి సోక్రటీసుకు విషపాత్ర అందించాడు. కులాసాగా నవ్వుతూ ఆయన ఆ విషం అంతా తాగివేశాడు. క్రమక్రమంగా శరీరం అంతా వ్యాపించిన మృత్యు శైత్యంలో ఆ మహాత్ముని జీవితం ఆ విధంగా పరిసమాప్తమయింది. "ఆ మహానీయుని తరంలో వారందరికన్నా ఆయన మహోన్నతుడు. న్యాయ చారిత్రుడు. మహోత్తముడు"అని సోక్రటీసును ప్లేటో ఎంతోగొప్పగా ప్రశంసించాడు.

క్రీస్తు పూర్వం 428 లో ప్లేటో జన్మించాడు. సోక్రటీస్ మృతి సమయానికి ఆయన వయస్సు 30 సంవత్సరాలు. శాస్త్రీయ పరిశోధనకు తత్త్వశాస్త్రాభివృద్ధికీ ప్రసిద్ధిగన్న విజ్ఞానపరిషత్తు ప్రారంభించిన ప్రముఖుడు ప్లేటో. ఆయన కొన్ని ప్రసంగాలు రచించాడు. ఆ ప్రసంగాలలో సోక్రటీస తన తాత్త్విక సిద్ధాంతా లావిష్కరించి వ్యాఖ్యానిస్తాడు. ప్లేటో ఈ విధంగా తన సిద్ధాంతాలే సోక్రటీస్ ముఖతః వ్యాఖ్యానింప చేస్తున్నాడో లేదో ఇతమిత్థంగా తేల్చి చెప్పలేము.

"సమర్థన" అనే ప్రసంగం సోక్రటీస్ జీవిత ధోరణికొక సమగ్రమయిన సమర్థన. తన మీదచేసిన ఆరోపణల కన్నిటికీ సోక్రటీస్ ఈ ప్రసంగంలో సమాధానాలిస్తాడు. ఆయన సోఫిస్టులనే గ్రీకు తాత్త్వికుల ధోరణికి సంబంధించినవాడు కాడు. అలాగే కేవల శాస్త్రీయ దృక్పథం కూడా అవలంబించలేదు. అయితే ఆ తత్త్వవేత్త అందరికన్నా మిన్న. మహావేత్త. తాను పరీక్షించిన వారందరు బాగా తెలిసినవారమని భావించే వారనీ, కానివారజ్ఞులనీ, తనకేమీ తెలియదని తెలుసుననీ,ఆవిధంగా వారందరికన్నా తానే విజ్ఞుడననీ ఆయన భావించాడు. ప్రజలందరికీ సౌశీల్యం ఉపదేశించవలసినదని పరమేశ్వరుడే తనకు ఆనతిచ్చాడనీ, ప్రభుత్వం ఎటువంటి కఠినశిక్ష విధించినా తన ధోరణి విరమించ దలచుకోలేదనీ సోక్రటీస్ ప్రసంగించాడు. ప్రభుత్వమే కనక మరణదండన విధిస్తే అది ప్రభుత్వానికే గాని తన కేవిధంగాను అపకారం కాదనీ, మరణశిక్ష దానికి ప్రతిఫలం కాదనీ ఆయన అభిప్రాయం. చిట్టచివరి కా మహా తత్త్వవేత్త ప్రసంగం

ప్రశాంతంగా ముగిసిపోతుంది. "నిష్క్రమణ సమయం సమీపించింది. ఇక ఎవరివారిని వారు వెళ్ళిపోతున్నారు. నేనిక మరణించటానికి బయలుదేరు తున్నాను. మీరంతా జీవితయాత్ర కొనసాగించటాని కుపక్రమిస్తున్నారు. వీటిలో ఏది మంచిదో ఆ పరమేశ్వరునికే తెలియాలి" అని ప్రవచిస్తాడా మహా తత్త్వవేత్త.

'క్రిటో' ప్రసంగంలో సోక్రటీస్ స్నేహితుడు క్రిటో కారాగారంలో సోక్రటీస్‌ను సందర్శించి, తప్పించుకొని పారిపొమ్మని హెచ్చరిస్తాడు. దీనికి కావలసినంత ధనం ఖర్చుచెయ్యడానికి సిద్ధంగా ఉన్నాననీ, మిత్రులెందరో ఈ ప్రయత్నంలో సాహాయ్యం చెయ్యడానికి ముమ్మందుకు వస్తున్నారనీ దీని కంగీకరించ వలసినదనీ సోక్రటీస్ ననేక విధాల బతిమాలు కొంటాడు. ఎన్నో ప్రదేశాలలో తనకు స్వాగతంఇచ్చి, గౌరవించే ఆప్తులెందరో ఉన్నారని ప్రోత్సహిస్తాడు. హింసకు ప్రతిహింస చెయ్యడం న్యాయం కాదనీ, అంతేకాక దేశంలో అమలులో ఉన్న చట్టాలుల్లంఘించడం అధర్మమనీ సోక్రటీస్ ప్రత్యుత్తరం ఇస్తాడు. తన జీవితం అంతా ఆ చట్టాల సంరక్షణలోనే సాగిపోయిందనీ, ఆ విధంగా తాను వాటికెంతో ఋణపడి ఉన్నాననీ, కనక ఇప్పుడవి ఉల్లంఘించడం ధర్మం కాదనీ వాదిస్తాడు. ఇంతకు పూర్వం వాటివల్ల అసంతృప్తి కలిగినప్పుడా సమయంలోనే దేశం విడిచి వెళ్ళి ఉండవలసినదనీ, ఇప్పుడిక అది సముచితం కాదనీ సనర్థించు కొంటాడు. అదీగాక భగవద్భక్తుని హృదయంలో మారుమోగే మురళీగానం వలె తన శ్రుతి పుటాలలో పరమేశ్వర వాణి మంద్రమంద్రంగా ప్రతిధ్వ నిస్తున్నదనీ, ఇది నీ వాదం వినసీయడం లేదని క్రిటోతో అంటాడు. "నాయనా క్రిటో! పరమేశ్వరేచ్ఛా ప్రకారం నడుచుకోవాలనే నిశ్చ యించాను. ఆయన ఎటు నడిపిస్తే అటే నడిచిపోతాను" అని ఈ విధంగా తన ప్రసంగం ముగించాడా మహావిజ్ఞాని.

మద్రాసు,

19 వ మే, 1958

ఎల్. డి. మూర్తి

కొత్త ప్రశ్నలని తిరగబడి పోరాడే వారికన్నా, స్వతంత్రంగా ఆలోచించే మేధావులను చూస్తే — అధికారంలో ఉన్నవారికి ఎక్కువ భయం. నిర్భీకునకు, నిస్సహాయునకు, అమాయకునకు అయిన 70 ఏళ్ళ సోక్రటీసు చేసిన నేరం కూడా — స్వతంత్రంగా ఆలోచించి, తనకు తోచినది నిర్భయంగా చెప్పడమే! నాటి పోటీలలో జరిగే నిరంతర ప్రసంగాలక్కూ అధికారవర్గానికి, వాళ్ళకి అనుకూలంగా నిలచిన వాళ్ళ- విపరీతమైన భయం కలిగించాడు సోక్రటీస్.

చివరికి చెయ్యగలిగింది లేక, సోక్రటీస్ నోరు నొక్కుకోడానికి అతనిపై — యువకులను పెడమార్గం పట్టిస్తున్నాడనీ, దేవతలు లేరని ప్రబోధిస్తున్నాడనీ ఆరోపణలు మోపి, అతనిని రచ్చకీడ్చి విచారణ జరిపారు.

ఈ నేరారోపణ అంతా నడిపించినవారు — అనిటస్ అనే రాజకీయ నేత, మెలిటస్ అనే కవి, లైకన్ అనే అలంకారికుడు. సోక్రటీస్ తన మీది ఆరోపణలకు సమాధానంగా యిచ్చిన ఉపన్యాసాన్ని — "సమర్థన" అనే పేరుతో — కొంతకాలం తరవాత ప్లేటో రచించాడు. క్రీ.పూ. 399లో యీ విచారణ జరిగింది. అప్పటికి ప్లేటో 30 ఏళ్ళవాడు. అతను విచారణ సమయంలో న్యాయస్థానంలో ఉన్నాడు.

ఈ రచనలో అక్షరాలా సోక్రటీసు నోట వచ్చిన మాటలే వుండక పోయినా — బహుశా అతను ఆనాడు అనుసరించిన వాదన ధోరణి ఇంచుమించు యథాతథంగా ప్రకటితమౌతున్నది.

సోక్రటీసు తన ఉపన్యాసాన్ని తన ప్రాణరక్షణకోసం ప్రాధేయపడడానికి కాకుండా, తానంటే అధికారవర్గం వారికి నిజంగా ఉన్న భయం బట్టబయలు చెయ్యడానికి వినియోగించుకున్నాడు. తన ప్రాణం ఎప్పటికేనా పోయేదే అనీ, తనకున్న అల్పావకాశంలో తాను చెప్పబోయే

## సమర్థన

మాటలు - మానవజాతిలో అధికారవర్గాల అహంకారానికీ, విజ్ఞానానికీ సంఘర్షణ ఉన్నంతకాలమూ శాశ్వతంగా వినిపిస్తూంటాయనీ విశ్వాసమున్న ప్రవక్తలాగ ఉపన్యసించాడు. అచంచలమైన సత్యదీక్ష, ప్రగాఢమైన ధర్మనిరతి, ఆ మహానుభావునికి ఆ విశ్వాసాన్ని యిచ్చాయి.

మరణదండన విధింపబడ్డ తరవాత చేసిన చిన్న ఉపన్యాసంలో- తన తప్పులు ఒప్పుకొని బ్రతికించమని బతిమాలలేదు సరికదా- తన మరణంతో తన గొంతు మూగవడిపోతుందనుకున్నవారు భ్రమపడుతున్నారనీ, తన తరవాత తన గొంతుకను వేయి రెట్లుగా యువకులు వినిపింపజేస్తారనీ, హెచ్చరిస్తాడు. తాను చేయని తప్పుకు క్షమాపణ వేడుకోడు. అన్యాయ్య మార్గాన జీవించడంకన్నా- న్యాయంకోసం ధైర్యంగా మరణిస్తానంటాడు. చివరికి- భయపెట్టి నోరునొక్కేద్దామనే తలంపుతో విచారణ మొదలుపెట్టిన న్యాయాధిపులు తనకు 'వీరమరణం' విధించవలసిన స్థితి కల్పించాడు సోక్రటీస్.

# సమర్థన

ప్రసంగంలో పాల్గొన్నవారు

సోక్రటీస్, మెలిటస్

ప్రదేశం

న్యాయస్థానం

సోక్రటీస్ ప్రసంగిస్తున్నాడు

ఏథెన్స్ పౌరులారా ! నాపై నిందారోపణ చేసినవారి వల్ల మీలో ఎలాంటి మార్పు కలిగిందీ - నేనిప్పుడు చెప్ప లేను. కాని, వారు నేనెవరయిందీ నేనే మరచిపోయేటట్లు చేశారు. వారి ప్రసంగం అందరిచేత ఔననిపించే ధోరణిలో సాగింది. కాని, వారి మాటల్లో కించిత్తయినా యథార్థం లేదు. మీరందరు చాలా జాగ్రత్తగా ఉండాలనీ, నా వక్తృత్వ శక్తి వల్ల మోసపోకూడదనీ మిమ్మల్ని హెచ్చరించారు. వారు చెప్పిన అసత్యాలన్నిటిలోను, దీనికి నేనెంతయినా ఆశ్చర్య పడ్డాను. పెదవి కదపగానే, నేను చెప్పిన దానిలో అబద్ధా లేపయినా ఉంటే, ఇట్టే పట్టుకోవచ్చును. నా ప్రసంగాల వల్ల నేనొక గొప్ప వక్తనని రుజువుకానేలేదు. అయినా నాపై నిందారోపణ చేసిన వారీ విధంగా అన్నారంటే- ఇది ఎంతయినా సిగ్గుపడవలసిన విషయం. నా 'వక్తృత్వ శక్తి' అంటే నా మాటలలోని యాథార్థ్యమే అని వారి అభిప్రాయ మయితే- నేనొక వక్తనని అంగీకరిస్తున్నాను. అయితే నా వక్తృత్వానికీ, వారి వక్తృత్వానికీ మధ్యన ఎంత తేడా ఉన్నది! నేనన్నట్లు వారన్న మాటలలో సత్యం లేశమయినా లేదు. ఇప్పుడు యథార్థం అంతా ఉన్నది ఉన్నట్లుగా సమగ్రంగా మీకు తెలియజేస్తున్నాను. వారు బాగా ఆలోచించి చాలా సొగసయిన మాటలతో చిలవలు, పలవలు పెట్టి ప్రసంగించారు. కాని నేనా విధంగా ప్రసంగించడం లేదు. అలాంటిపని ఎప్పుడూ

నావల్ల జరిగనే ఉండదు ! నాకు సరిగా ఈ సమయంలో స్ఫురించిన మాటలతోనే ప్రసంగం ప్రారంభిస్తున్నాను. న్యాయం నా వైపున ఉన్నదని నాకొక గట్టి నమ్మకం. ఏథెన్స్ పౌరులారా ! నేనీ వార్ధక్యంలో ఉడుకు రక్తంతో ఉప్పొంగే యువకుని ధోరణిలో ప్రసంగించడం సముచితం కాదు. మీ రెవ్వరూ నా ముఖతః ఇటువంటి ప్రసంగంకోసం ఎదురు చూడనక్కర లేదు. మిమ్మల్ని ఒక్క చిన్న విషయం అర్థిస్తున్నాను. అలవాటయిన ధోరణిలోనే నా ఆత్మరక్షణ కోసం ప్రసంగిస్తున్నాను. ఈ సందర్భంలో ఎగోరా*లో వడ్డీ వ్యాపారుల దగ్గర, ఇంకా ఇతరత్ర వాడిన మాటలే వాడుతున్నాను. దీనికి మీ రాశ్చర్య పడవద్దనీ, నాకు అడ్డుతగల వద్దనీ అర్థిస్తున్నాను. దీనికొక కారణం కూడా ఉన్నది. నాకిప్పుడే సుమారు డెబ్బయిఏళ్ళు పైబడ్డాయి. జీవితంలో మొట్టమొదటగా ఇప్పుడే ఇటువంటి న్యాయ స్థానంలో అడుగు పెడుతున్నాను. ఈ న్యాయ స్థానం భాషా ధోరణి నాకు బొత్తిగా కొత్త. అందుచేత నిజంగా నేనొక పరాయి దేశస్థుణ్ణనీ, నా అలవాటయిన స్వదేశ భాషలోనే ప్రసంగిస్తున్నాననీ భావించాలి. అందుకు నన్ను మన్నించాలి. నేను మిమ్మల్ని అడగకూడనిది ఏదయినా అన్యాయంగా అర్థిస్తున్నానా ? నా ధోరణి సరి అయినది కావచ్చును. కాకపోవచ్చును. దీని విషయమై మీరేమీ ఆలోచించ నక్కర లేదు. నా మాటలలోని సత్యాన్నిగూర్చి ఆలోచించండి.

* విపణి వీథి

ఆ విషయం యెడల శ్రద్ధ వహించండి. వక్త యథార్థం చెప్పాలి. ఆ పైన న్యాయాధిపతులు న్యాయం నిర్ణయించాలి.

ప్రప్రథమంగా నేనిప్పుడు చాలా కాలానికి పూర్వం నించి నన్ను నిందించే వారి దూషణలకు సమాధానాలిస్తున్నాను. ఇటీవల నామీద నిందారోపణ చేసినవారి కటుపిమ్మట సమాధానాలిస్తాను. పూర్వంనుంచి నన్ను నిందించినవారు నామీద ఎన్నెన్నో ఆరోపణలు చేశారు. వారన్నవన్నీ అసత్యాలే. ఆ నిందారోపణలు చాలా సంవత్సరాలుగా సాగి పోయాయి. ఎనిటస్ కన్నా అతని అనుచరులకన్నా ఇటువంటి వారి నిందలు నాకెంతో మనస్తాపం కలిగిస్తాయి. ఎనిటస్ను, అతని అనుచరులు– వారిధోరణిలో వారు బాగా ప్రమాదం తెచ్చిపెట్టేవారే. కాని తదితరుల ధోరణి, వీరి ధోరణి కన్నా ఎంతో ప్రమాదకరమయినది. మీరంతా బాగా చిన్నవారుగా ఉన్నప్పటినుంచీ వారు నన్ను దుయ్యబట్టడం మొదలుపెట్టారు. ఎన్నెన్నో అసత్య కల్పనలు చేసి మీ హృదయాలు కలుషితం చేశారు. సోక్రటీస్ అనే విజ్ఞాని స్వర్గాంతరాళంగురించీ, పాతాళంగురించీ పరిశోధనలే వేవో కొనసాగిస్తున్నాడనీ, చెడ్డవి మంచివిగా కనబడేటట్లు ప్రచారంచేస్తున్నాడనీ వారందరూ నిందించడం ప్రారంభించారు. ఈ విధంగా కట్టు కథలు చెప్పి దుయ్యబట్టే వారంటే నాకు చాలా భయం. భూమ్యాకాశాలనుగూర్చి పరిశోధనలు సాగించేవారికి దేవతల ఉనికిపైన నమ్మిక ఉండదని ఆ దుయ్యబట్టేవారి మాటలాలకించే వారి కనిపించడం సహజం. ఈ విధంగా నన్ను నిందించినవారు చాలామంది ఉన్నారు. ఆ పైన వారి ఆరోపణలు చాలా

కాలంగా సాగాయి. సాగుతున్నాయి. అదీకాక మీ చిన్న తనంలోను, యౌవనంలోను మీరు విన్నవన్నీ నిజమనే నమ్మే పరిస్థితిలో ఉంటారు. ఆసమయంలోనే ఆనిందారోపకులు మీ చెవిలో ఇల్లు కట్టుకుని పోరారు. ఆరోపణల కన్నిటికి ప్రతి సమాధానాలిచ్చే వారెవరూ లేకపోయారు. అందుచేత వారి నిందలు నిరభ్యంతరంగా సాగిపోయాయి. అంతకన్నా పెద్ద ఇబ్బంది ఒకటి వచ్చిపడింది. ఆ విధంగా నన్ను తూర్పారబట్టే వారెవరో నే నెరుగను, నాకు వారి పేరు లంతకన్నా తెలియవు. అయితే వారిలో ఒక హాస్యకవి * నామధేయం మాత్రం తలవని తలంపుగా తెలుసుకోవడం జరిగింది.

అసూయా ద్వేషాలతో చాలా మంది మీ చెవిలో ఇల్లుకట్టుకుని పోరి, నాపైన లేనిపోని వేవేవో ఆరోపించారు, మున్ముందుగా వారు తాము చెప్పేవి నిజమే అని విశ్వసించారు. ఇలాంటి వ్యక్తులతో వ్యవహరించడం చాలా కష్టం. వారినిక్కడికి పిలిపించి ఎదురు ప్రశ్నలు వేసి పరీక్షించడానికి అవకాశం లేదు. అందుచేత ఆత్మరక్షణకోసం నేనిప్పుడు కేవలం నీడలతోనే పోరాడాలి. సమాధానాలిచ్చేవారెవరూ లేకపోయినా వాదోపవాదాలు సాగించాలి. నా ప్రత్యర్థులు

* ఈ హాస్యకవి ఆరిస్టోఫానెస్. ఇతడు క్రీస్తు పూర్వం 423 లో 'మేఘాలు' (క్లౌడ్స్) అనే రూపకం రచించాడు. దానిలో సోక్రటీస్‌ను అపహాస్యం చేశాడు. దుష్టోద్యమాలన్నీ సదుద్యమాలుగా కనిపించేట్టు చేస్తూ సోక్రటీస్ తన 'ఆలోచనా విపణి'ని కొనసాగించాడని ఆ రూపకం సోక్రటీస్‌ను వ్యంగ్యంగా అవహేళన చేస్తున్నది.

రెండు ర కాల వారున్నారని నేనింతకు పూర్వమే అన్నాను. ఈ విషయంలో మీరు కూడా నాతో ఏకీభవించాలి. మొదటి రకం వారధునాతనులు. రెండవరకం వారు పురాతనులు. నే నిప్పుడు చాలా కాలంగా నా మీద నిందారోపణలు చేసే రెండవరకం వారికి సమాధానాలిస్తున్నాను. ఈవిధంగా, ఇటువంటి వారికే మున్ముందుగా సమాధానా లివ్వడంలో గల ఔచిత్యం మీరు గుర్తించగలరని భావిస్తున్నాను. మిగిలిన వారి ఆరోపణల కన్న వీరి ఆరోపణలే చిరకాలంనుంచీ మీ రెన్నోసారులు విన్నారు.

నా మీద చాలా కాలంగా ఒక నింద ఉన్నది. స్వల్ప వ్యవధిలోనే ఆ నింద తొలగించుకొని ఆత్మరక్షణ కుపక్రమించి తీరాలి. ఈ ప్రయత్నంలో నెగ్గడం మన ఉభయులకూ శ్రేయస్కరమయితే, ఇది నా ఉద్యమానికి చేయూత నివ్వ గలిగితే, నేనీ విషయంలో కృతకృత్యుడ నగుదును గాక! అయితే ఇది అంత తేలిక వ్యవహారం కాదు! దీని స్వరూప స్వభావాలు నాకు పూర్తిగా తెలుసును. కాని, ఇదంతా ఆ దైవానికే వదలివేసి, న్యాయప్రకారం ఆత్మరక్షణ ప్రారంభిస్తాను.

మొట్టమొదటగా నామీది ఆరోపణను గురించే ఉపక్ర మిస్తాను. అందరియెదట నన్నపఖ్యాతిపాలు చెయ్యడాని కసలు నా మీద చేసిన దోషారోపణ ఏమిటి? ఏది మెలిటస్‌ను నాపై దోషారోపణ చెయ్యడానికి ప్రత్యేకంగా పురిగొల్పింది. ఇంతకీ నన్ను దూషించే వారేమంటున్నారు? వారే నన్నిప్పుడు

దోషిగా ప్రతిపాదించబోతున్నారు. వారనే మాటలన్నీ సంగ్రహంగా మీకు తెలియజేస్తున్నాను. అవి ఇవి :

"సోక్రటీస్ దుర్మార్గుడు. విచిత్రమయిన వ్యక్తి. భూమ్యాకాశాల అంతరాళాలలో ఉన్న విషయాలు పరిశోధించి చెడ్డ వన్నీ మంచివిగా కనిపించేటట్లు చెయ్యడమే అతని పని. ఇంతటితో ఊరుకోక ఈ విషయమయిన సిద్ధాంతాలన్నీ అత డితరులకు కూడా బోధిస్తున్నాడు."

వారి దోషారోపణల ధోరణి ఇది. అరిస్టోఫాన్స్ హాస్య రూపకంలో మీకు అందరికీ అది సుపరిచితమే. ఆయన ఆనాటకంలో ఒకవ్యక్తిని ప్రవేశపెట్టాడు. అతనిపేరు సోక్రటీస్. అతడు ఆకాశంలో సంచరిస్తున్నానంటూ అనేక విషయాలను గురించి తాడూ బొంగరం లేని ధోరణిలో మాట్లాడుతుంటాడు. నాకా విషయాల ఘోష ఏమీ తెలియదు. ప్రకృతికి సంబంధించిన విషయాలపై పరిశోధనలు సాగించే వారిని గురించి అమర్యాదకరంగా మాట్లాడటం నాకసలు రుచించదు. ఈ విషయంలో మెలిటస్ ఇంతటి పెద్ద దోషారోపణ చెయ్యడం నాకెంతయినా కించ కలిగిస్తున్నది. ఇటువంటి ప్రకృతి పరిశోధనలతో నా కేమాత్రం సంబంధం లేదు. ఏథెన్స్ పౌరులారా ! అసలు యథార్థ విషయం ఇది. ఇక్కడ ఉన్నవారిలో చాలా మంది కీ యథార్థం తెలుసును. వారికి నేనొక విజ్ఞప్తి చేస్తున్నాను. మీరంతా నా ప్రసంగాలు విన్నారు. ప్రకృతికి సంబంధించిన పరిశోధనల విషయంలో కొద్దిగా గాని, ఎక్కువగా గాని అభిప్రాయాలేవైనా నేను

వెల్లడించానా చెప్పండి! ఆ సమయంలో నేనేమన్నానో మీ ఇరుగు పొరుగులకు కూడా తెలియజేయండి!...... మీరందరు వారు చెప్పే సమాధానాలు వినండి. నాపై చేసిన ఆరోపణలో ఇది ఒక భాగం. దీనిమీద గనక మీరంతా ఆ సాక్షులు చెప్పేది వింటే ఇక మిగిలిన ఆరోపణలో గల సత్యాసత్యాలు కూడా అవగాహన చేసుకోగలరు.

నేను ఉపాధ్యాయ వృత్తి అవలంబించి, దానికి ప్రతి ఫలంగా ధనం స్వీకరిస్తున్నాననే ఆరోపణకు బొత్తిగా పునాది లేదు. వెనకటి దానిలో ఎంతటి సత్యంఉన్నదో దీనిలోనూ అంతే సత్యం ఉన్నది. నిజంగా మానవజాతికి అచార్యత్వం నిర్వ హించే సామర్థ్యమే ఉంటే- దానికి ప్రతిఫలంగా ధనం స్వీకరిం చడం నా అభిప్రాయం ప్రకారం చాలా గౌరవ వ్యవహారం. జార్జియాస్, ప్రోడికస్, హిప్పియాస్- ఈముగ్గురూ ఈ విధంగా జీవనం సాగించినవారే. ఏ రాయా నగరాలలో సంచరిస్తూ ఉచితంగా చదువుచెప్పే ఉపాధ్యాయులను కూడా విడిచి తమ దగ్గర విద్యాభ్యాసం చెయ్యవలసిందని విద్యార్థులను ప్రోత్స హించి కృతకృత్యులయినారు. యువకులు వారికి కేవలం ప్రతిఫలం ముట్టజెప్పడమే గొప్పకాదు. ఆ విధంగా ప్రతిఫలం స్వీకరింప జేసినందులకు కృతార్థులమైనామని కూడా ఆ యువకులు భావిస్తున్నారు. ప్రస్తుతం ఏథెన్స్‌లో ఒక తత్త్వ వేత్త ఉన్నాడు. అసలా వ్యక్తి పారోస్ ప్రాంతీయుడు. అతనిని గురించి నాకు కొంత తెలుసును. ఒక మారతడిలా గన్నాడు.

"హిప్పోనికస్ కుమారుడు కాలియన్ సోఫిస్టు ♦ తత్త్వవేత్తలకోసం ధనం అపరిమితంగా ఖర్చు చేశాడని విన్నాను. అతని కిద్దరు కుమారులు ఉన్నారు. ఒకమారు నేనతనితో అన్నాను: "నీపిల్లలిద్దరూ లేగదూడలుగాని గుర్రపు పిల్లలుగాని అయిఉంటే, వారికి శిక్షణ ఇవ్వడంకోసం ఎవరో ఒకరిని ఏర్పాటు చెయ్యడం అంత కష్టంగాదు. అశ్వశిక్షకులనో లేక వ్యవసాయదారులనో వారి శిక్షణకేర్పాటు చెయ్యవచ్చును. బహుశః అటువంటి శిక్షకులు తగిన శిక్షణ ఇచ్చి వారి శక్తిసామర్థ్యాలకు పరిపూర్ణత కలిగింపవచ్చును. కాని పిల్లలు మానవులు గదా! వారి శిక్షణకోసం ఎవరి నేర్పాటు చేస్తున్నావు? పిల్లలు గలవాడవు గనక నీవీ విషయమై ఆలోచించి ఉండవచ్చును. మానవ సద్గుణాలు, పౌర ధర్మానికి కావలసిన సద్గుణాలు అవగాహన చేసుకొన్న వారెవరైనా ఉన్నారా?" "ఒకరున్నారు." అన్నాడతడు. "ఎవరాయన?" ఏ దేశస్థుడు? ఈ విధంగా శిక్షణ ఇచ్చినందు కెంత తీసుకుంటాడు?" అని మళ్ళీ అడిగాను. "ఆయన పారియన్ నివాసి ఈవినస్. అం ఐదు 'మినా' నాణాలాయన అడిగే ప్రతిఫలం" అని సమాధానం ఇచ్చాడు కాలియస్. "ఈవినస్‌కు ఈ విధంగా శిక్షణ ఇవ్వగలిగినంత విజ్ఞానమే ఉంటే, ఇంత తక్కువ ప్రతిఫలంతో తృప్తిపడి బోధించగలిగితే, నిజంగా అతడు అదృష్టవంతుడే"

♦ సోఫిస్టులంటే విజ్ఞానం కోసం తహతహలాడే వారని అర్థం. కాని క్రమక్రమంగా ఈ పదానికి అర్థం మారింది. విజ్ఞానానికి బదులుగా అది వ్యక్తం చేసే విధానానికే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు సోఫిస్టులు. ఇందువల్ల క్రమంగా వీరి పేరు ప్రఖ్యాతులు దిగజారిపోయాయి.

అని నాలో 'నే ననుకొన్నాను. నాకే అంతటి విజ్ఞానం ఉంటే నే నెంతయినా గర్వపడి ఉందును. అసలు కథ ఏమంటే, నా కటువంటి విజ్ఞానమేమీ లేదు"

ఏథెన్స్ పౌరులారా! దీనికి మీలో ఎవరయినా ఈ విధంగా అడగవచ్చు: "అయితే సోక్రటీస్! నీ మీద చేసిన ఈ ఆరోపణల కన్నిటికీ అసలు కారణ మేమిటి? నీ వేదో విడ్డూరం చేస్తూ ఉండాలి. మిగిలిన సామాన్య పౌరులలాగే ఉండి ఉంటే, నీమీద ఇటువంటి అపోహాలు, నిందలు బయలుదేరి ఉండవు. వెనక ముందు లాలోచించకుండా నిన్ను విచారించడానికి మాకెంతో కించ కలుగుతున్నది. ఈ అపోహాల కన్నిటికీ ఆధార మేమో తెలియజెయ్యి." అని నన్ను కోరగల వ్యక్తి మీలో ఒక్కడైనా లేకపోడు.

ఈ విధంగా నిలబెట్టి ప్రశ్నించడం సమంజసమనే అనుకుంటున్నాను. నన్ను విజ్ఞాని అంటున్నారు. ఆ పైన దీనిమీద ఎంతో అపఖ్యాతికూడా వచ్చింది. దీనికి గల కారణాలన్నీ విశదం చెయ్యడానికి ప్రయత్నిస్తాను. దయఉంచి నేను చెప్పేదంతా శ్రద్ధగా ఆలకించండి! నేనేదో వేళాకోళంగా మాట్లాడుతున్నానని మీలో కొందరికి అనిపించవచ్చును గాని, ఈ సందర్భంలో ఉన్న యాథార్థ్యం యావత్తు మీ ముందుంచు తున్నానని ఎలుగెత్తి చాటుతున్నాను. ఏథెన్స్ పౌరులారా! నాలో ఒక విధమయిన విజ్ఞత ఉండడం వల్లనే ఈ ప్రఖ్యాతి వచ్చింది. "ఆ విజ్ఞానం ఎటువంటిది" అని మీరు ప్రశ్నించ వచ్చును. ఈ నావిజ్ఞానం మానవు లాకళించుకో గలిగినదే అని

ప్రత్యుత్తరం ఇస్తున్నాను. ఆ అవధి వరకు నా విజ్ఞతపై నాకు నమ్మిక ఏర్పడింది. అయితే నేనిప్పుడు మీ ఎదుట ప్రస్తావించే వ్యక్తులు కొందరు మానవాతీత విజ్ఞత కలవారు. ఆవిజ్ఞత ఎటువంటిదో నేను వర్ణించి చెప్పలేక పోవచ్చు. అటువంటి విజ్ఞత నాలో లేకపోవడమే దీనికి కారణం. నాకా విధ మయిన విజ్ఞత ఉన్నదని చెప్పేవారు కేవలం అబద్ధా లాడు తున్నారు. అంతే గాదు. నా నిజాయితీకే భంగం కలిగిస్తున్నారు. ఏథెన్సు పౌరులారా! ఈ సందర్భంలో నా ప్రసంగాని కడ్డు తగల వద్దని మిమ్మల్ని అందరినీ అర్థిస్తున్నాను. నేనేవో అతిశయోక్తులతో ప్రసంగిస్తున్నానని మీకు తోచినా సరే! కొంచెం ఓరిమి వహించండి! నేనిప్పుడు చెప్పేవి నామాటలు కాదు. ఒక వ్యక్తి చెప్పినమాటలు ఇక్కడ ఉదహరిస్తున్నాను. ఆ వ్యక్తి మీరందరు గౌరవించి విశ్వసించే వాడే! ఆ సాక్షి మరెవ్వరో కాదు! సాక్షాత్తు ఆ డెల్ఫీ దేవతే! నాలో అటువంటి విజ్ఞత అంటూ ఉంటే దానిని గురించీ, దాని తరహాను గురించీ ఆ దేవత మీకు తెలుపుడు చెయ్యగలదు. చీరిఫన్ అంటే ఎవరో మీ కందరికీ తెలిసే ఉంటుంది. చాలా కాలం నుంచీ ఆయన నాకు మిత్రుడు. మీకు కూడా ఆయన స్నేహితుడే. ఈ మధ్యను కొంతమందికి విదేశ ప్రవాసశిక్ష పడింది. చీరిఫన్ అది అనుభవించి మీలో కొందరితో కలిసి ఇక్కడకు వచ్చాడు. అతడేమి చేసినా ముందు వెనక లాలోచించకుండా చేస్తాడు, చాలా తొందర మనిషి. చీరిఫన్ అతి ధైర్యంగా డెల్ఫీ దేవత సన్నిధికి వెళ్ళి ఒక ప్రశ్న అడిగాడు.

నేను మాటిమాటికి విన్నవిస్తూనే ఉన్నాను. దయ ఉంచి నా ప్రసంగాని కడ్డుతగలకండి! సరే– చీరిఫన్ మహా ధైర్యంతో ఢెల్ఫీ దేవాలయంలో ప్రవేశించి "సోక్రటీస్ కన్న ఎక్కువ విజ్ఞత కలవా రెవరైనా ఉన్నారా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకక్కడ అర్చన చేసే భక్తురాలు ♦ "సోక్రటీస్ కన్నా విజ్ఞులెవరూ లేరు!" అని ప్రత్యుత్తరం ఇచ్చింది. చీరిఫన్ ఇప్పుడు మనలో లేడు. ఆయన మరణించాడు. కాని ఆయన సహోదరు డిప్పుడీ న్యాయ స్థానంలోనే ఉన్నాడు. నా మాటల్లో సత్యాసత్యా లాయన నిర్ణయింపగలడు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసునా? నా కిటువంటి అపఖ్యాతి రావడానికి కారణాలేవో వివరించడానికే ఇవ్వన్నీ ఉట్టంకిస్తున్నాను. నా కా విషయం తెలిసినప్పుడు "ఆ దేవత అభిప్రాయం ఏమైఉంటుంది?" అని నాలో నేను మథనపడ్డాను. స్వల్పవిజ్ఞానం గాని, మహా విజ్ఞానంగాని నాలో లేదని నాకు తెలుసును. అయితే నేను మానవు లందరికన్నా గొప్ప వేత్తనని ఆ భక్తురాలినోట ఆ దేవత ప్రవచించినదాని కర్థమేమిటి? ఈ చిక్కు విడదీయడ మెలాగ? డెల్ఫీ దేవత సాక్షాత్తు దైవమే! ఆయన అసత్యం చెప్పడానికి వీలులేదు. అనృతం చెప్పడం అసలా దేవత స్వభావమే కాదు. తర్వాత చాలా కాలం మథనపడి ఈ చిక్కు విడదీయడానికి కొక దారి

♦ పైథియన్. డెల్ఫీలోని అపోలో దేవాలయంలో భగవద్వాణిగా పేరెన్నికగన్న పైథియా అర్చకురాలుగా ఉండేది. భక్తులడిగే ప్రశ్నలకు తరుచుగా సందిగ్ధశుద్ధి లేని సమాధానాలు చెప్పేది.

పేర్పరచాలని ఆలోచించాను. నాకన్న విజ్ఞుడయిన ఒక వ్యక్తిని వెతికి పట్టుకోవాలని అనుకున్నాను. ఆ విధమైన వ్యతిరేక సాక్ష్యంతో అప్పుడా దేవత సన్నిధికి వెళ్ళవచ్చునని అనుకొన్నాను. "ఇదుగో ఈయన నాకన్న గొప్ప వేత్త. కాని నీ వింతకు పూర్వం మానవులందరికన్నా నేను గొప్ప వేత్తనని ప్రవచించావు" అని చెప్పవచ్చునని అనుకొన్నాను. పిమ్మట నేనొక వ్యక్తిదగ్గరకు వెళ్ళాను. అతనికి విజ్ఞాని అని విఖ్యాతి ఉన్నది. ఆ వ్యక్తి ధోరణి జాగ్రత్తగా పరిశీలించాను. అతని పేరిక్కడ పేర్కొనవలసిన ఆవశ్యకత లేదు. అతడొక రాజకీయవేత్త. కనకనే ఆయన ధోరణి పరిశీలించవలెనని అనుకున్నాను. నా పరిశీలన ఫలితం ఇక్కడ నివేదిస్తున్నాను. కొంచెంసేపు ప్రసంగం సాగించిన తర్వాత ఆయన నిజంగా వేత్త కాడని బోధపడింది. కాని విజ్ఞానవంతుడని ఛాలా మంది భావిస్తున్నారు. ఆతడు కూడా అలాగే అనుకుంటున్నాడు. అటుపిమ్మట "నీవనుకుంటున్నట్టుగా విజ్ఞానివి కావ"ని నేనతనికి వివరించి చెప్పవలెనని సంకల్పించాను. కాని దానితో అతనికి నాపై ద్వేషం బయలుదేరింది. అక్కడ నా ప్రసంగం ఆలకించినవారిలో చాలా మందికి నామీద అటువంటి భావమే కలిగింది. అక్కడనించి తిరిగి వచ్చివేశాను. మార్గంలో నాలో నే నిలాగ అనుకొన్నాను. "నిజంగా శివము, సుందరము అయిన తత్వాన్ని గురించి అతనికి గాని నాకు గాని ఏమీ తెలియదు. కాని ఆ వ్యక్తికంటె నేనే నయం. ఆయన కేమీ తెలియదు. అయినా తనకు తెలుసునని అనుకొంటున్నాడు. నాకూ ఏమీ తెలియదు. తెలుసునని కూడా అనుకోవడం

లేదు. ప్రత్యేకంగా ఈ రెండవ విషయంలో అలనికంటే నేనే చూపువాసి నయం అని తోచింది. అనంతరం నేనింకొక వ్యక్తిదగ్గిరికి వెళ్ళాను. అతనికి అంతకన్నా విజ్ఞత ఉన్నదని విఖ్యాతి ఏర్పడింది. కాని నా పరిశీలన ఫలితం ఒక్కటే. వెనకటి వ్యక్తికీ ఈవ్యక్తికీ మధ్యన నా కెక్కడా తేడా కనిపించ లేదు. కాని అతనితో పాటింకా మరి కొందరికీ నా మీద ద్వేషం ఏర్పడింది.

ఈ విధంగా నా మీద ద్వేషం పెచ్చు పెరుగుతున్నా అలాగ ఒకరి తరవాత ఇంకొకరిని సందర్శించటం విరమించ లేదు. అయితే ఈ ద్వేషాన్ని గురించి ఎంతో విచారించాను. భయపడ్డాను. దైవవాణిని గురించి పరిశీలించడం నా ప్రథమ కర్తవ్యం. అటువంటి ఆవశ్యకత వల్లనే అలాగ ఒకరి తర వాత ఇంకొకరిని సందర్శించడం జరిగింది. విజ్ఞానవంతు లందరి దగ్గరకీ వెళ్ళి తీరాలనీ దైవవాణి అంతరార్థం అవగాహన చేసుకోవాలనీ నిశ్చయించాను. ఏథెన్స్ పౌరులారా! మీ కందరికీ ఈ సందర్భంలో ఉన్నది ఉన్నట్టుగా చెప్పి తీరాలి. ఈ విషయమై నేను తీవ్ర శపథం చేస్తున్నాను. చిట్టచివరికి నా ప్రయత్నాలవల్ల కలిగిన ఫలిత మిది. పెద్దపెద్ద వేత్తలని పేరెన్నిక గన్నవారంతా కేవలం అజ్ఞానులు. నిజంగా అంతగా పేరు ప్రఖ్యాతులు లేనివారే వీరికన్న కొంత నయం. నేనీ విషయంలో చేసిన పర్యటనలను గురించీ, బ్రహ్మాండమైన ప్రయత్నాలను గురించీ మీకు వివరించి చెప్పడం చాలా అవసరం. ఎతో శ్రమపడి ఎందరెందరినో సందర్శించాను. కాని దానివల్ల దైవవాణికి తిరుగులేదని మాత్రమే తేలింది. రాజ

కీయు వేత్తలతో ప్రసంగించిన పిమ్మట నేను వేర్వేరు రకాల కవుల దగ్గరికి కూడా వెళ్ళాను. వారి సాన్నిధ్యంలో నాలో ఉన్న అజ్ఞానం అంతా బయటపడిపో గలదని అనుకున్నాను. ఆయా కవీశ్వరులు వ్రాసిన గ్రంథాలలోనించే కొన్ని కొన్ని వాక్యాలు సంగ్రహించి అవి వారి ముందుంచాను. అయా వాక్యాల కర్థాలు చెప్పవలసిందని అడిగాను. వారు కొన్ని కొన్ని కొత్త విషయాలు చెప్పగలరని ఆశించాను. ఇప్పుడు నేను చెప్పబోయే సంగతి మీరు నమ్ముతారో నమ్మరో అని భయపడుతున్నాను. ఆయా కవులు తమతమ రచనలను గురించి ప్రసంగించారు. కాని ఇక్కడ ఉన్న ఏ ఒక్కరయినా వారి కంటే బాగా ప్రసంగించగలరని నా అభిప్రాయం. ఈ యథార్థ విషయం అంగీకరించవలసి వచ్చినందుకు నాకెంత యినా కించగా ఉన్నది. ఒక విధమైన ప్రతిభా సామర్థ్యం తోనే ఆయా కవీశ్వరులాయా రచనలు సాగిస్తున్నారనీ, అంతే గాని విజ్ఞాన శక్తితో వారెవరూ ఆయా రచనలు చెయ్యడం లేదనీ నేనిప్పుడు తెలుసుకొన్నాను. వారు సోది చెప్పేవారి వంటివారు. సోది చెప్పే వారెన్నెన్నో మంచి విషయాలు చెబుతారు. కాని తాము చెప్పే మాటల అర్థమే వారికి తెలియదు. కవులు కూడా ఆజాతికి చెందినవారే అనిపించింది. అంతే కాదు. కవిత్వంలోని శక్తినిబట్టి తదితర విషయాలలో కూడా ప్రజలందరిలోను తామెక్కువ విజ్ఞాన వంతులమని వారనుకుంటున్నారు. నిజంగా వారితర విషయాలలో వేత్తలు కానేకారు. ఇంతకు పూర్వం ఒక కారణంవల్ల రాజకీయ నాయకులకన్నా నేను విజ్ఞుడనని అనుకున్నాను. ఆ కారణం

వల్లనే కవులకంటె విజ్ఞాని నసికూడా అనుకుంటున్నాను. అటుపిమ్మట అక్కడినించి బయలుదేరి ఇంకొక చోటికి వెళ్లాను.

చిట్టచివరికి చేతిపనులు చేసేవారి దగ్గిరికి వెళ్ళాను. నాకా విషయాలు బొత్తిగా తెలియవని నే నెరుగుదును. వారి కెన్నెన్నో మంచి సంగతులు తెలుసునని కూడా నా అభిప్రాయం. దీనిలో మాత్రం నేను పొరబడలేదు. నాకు తెలియని వెన్నెన్నో వారికి తెలుసును. ఇందుచేత నిశ్చయంగా వారి విషయంలో నాకంటె విజ్ఞులే. కాని ఈ గొప్పగొప్ప చేతిపనులు చేసేవారు కూడా కవులు చేసిన పొరబాటే చేశారు. వారందరు తమతమ వృత్తులలో మంచి నేర్పరులు. అంత మాత్రం చేతనే ఉదాత్త విషయాలెన్నో తమకు తెలుసునని భావించారు. వారి విజ్ఞానం ఇటువంటి లోపంచేత కలంకితమైపోయింది. అందుచేత దైవవాణి ప్రవచనం దృష్ట్యా నాలో నేనిలాగ తర్కించుకొన్నాను. నాకు రాజకీయవేత్తలు, శిల్పులు, మొదలైన వారి విజ్ఞానము లేదు; అజ్ఞానమూ లేదు. కనక నేనిలాగే ఉండిపోవడం మంచిదా? లేక శిల్పుల ధోరణిలో జీవించడం మంచిదా? చిట్టచివరకు దైవవాణి ప్రవచనం దృష్ట్యా నేనిలాగే ఉండిపోవడం సమంజసమని అనుకున్నాను.

ఈ విధమైన నిరంతర పరిశీలన వల్ల నా కెందరెందరో విరోధులేర్పడ్డారు. వారిలో విపత్కారకు లెందరో ఉన్నారు. ఇందువల్లనే నా మీద అనేక విధాల నిందారోపణలు బయలు దేరాయి. నేనొక వేత్తననే ప్రచారం ప్రారంభమయింది.

నే నితరులలో లేదన్న విజ్ఞత నాలో ఉన్నదని నా శ్రోతలు ఊహాగానాలు చెయ్యడం మొదలు పెట్టారు. కాని, ఏథెన్స్ పౌరులారా! పరమేశ్వరు డొక్కడే సర్వవేత్త. అదే పరమార్థము. ఆదైవవాణి ప్రవచనం ద్వారా మానవ విజ్ఞానం ఎందుకూ కొరగాదని సువ్యక్తం చెయ్యడమే ఆయన సంకల్పం. ఆ దైవ వాణి ప్రత్యేకంగా సోక్రటీస్‌ను గురించి ప్రసంగించ లేదు. కేవలం ఉదాహరణ కోసమే నా నామధేయం ఉట్టంకించాడా పరమేశ్వరుడు. సోక్రటీస్ వలె తన విజ్ఞానం అల్పాల్పమనీ, నిరర్థకమనీ గుర్తించిన వ్యక్తే మహా వేత్త అని పరమేశ్వరుడు సూచింప దలిచాడన్న మాట. దీనిలో ఇంతకంటె విశేషార్థ మేమీ లేదు. అందుచేతనే ఆ దైవవాణి ప్రవచనం ప్రకారం ప్రపంచంలో సంచరిస్తున్నాను. ఎవరైనా పౌరులు గాని, పరదేశస్థులు గాని, విజ్ఞులుగాని కనిపిస్తే వారివారి విజ్ఞత గూర్చి పరిశీలన కుపక్రమిస్తాను. నిజంగా వారి కటువంటి విజ్ఞతే లేకపోతే దైవవాణి ఆదేశానుసారం వారికి తమ అజ్ఞతను గూర్చి తెలియజేస్తాను. రాత్రింబవళ్లు ఈ కృషిలోనే మునిగి తేలుతున్నాను. ఇక ఆపైన పౌర వ్యవహారాలు గాని, నా స్వీయ వ్యవహారాలు గాని పరిశీలించడానికి నాకు వ్యవధిలేదు. ఈ విధంగా నిరంతరంగా దైవ ప్రవచన పరిశీలనకే నా కాలం-యావత్తు వినియోగించడం వల్లనే ఎంతో దారిద్ర్యం అనుభవిస్తున్నాను.

ఈ సందర్భంలో ఇంకొక సంగతి చెప్పవలసి ఉన్నది. బాగా ఆస్తిపాస్తులున్న కుటుంబాలకు చెందిన యువకులు తమంతట తామే నా వెంటబడుతూంటారు. వారి కిక చెయ్యే

వలసిన పనులేమీ ఉండవు. తీరిక ఎక్కువ. విజ్ఞులనబడే వారిని నేను పరీక్ష చెయ్యడము— అదంతా శ్రద్ధగా ఆలకించడము వారికిష్టం. ఒక్కొక్కప్పుడు వారు నన్ననుకరించడం కూడా కద్దు. తమ కేదో తెలుసుననుకొనే వారనేకులున్నారు. కాని, వారు త్వరలోనే తమ కేమీ తెలియదని గుర్తిస్తారు. ఈ ప్రకారంగా పరీక్షింపబడిన వ్యక్తులు తమ అజ్ఞతనుగూర్చి బాధపడడానికి బదులు నాపై కోపగించి ద్వేషిస్తున్నారు. ఈ దుర్మార్గుడు సోక్రటీసే యువకులందరినీ పెడమార్గాలు పట్టించి పాడుచేస్తున్నాడని నిందిస్తున్నారు. "సోక్రటీస్ ఇంతకీ చేసిన దుష్కృతమేమిటి? అతడు చేసే దుర్బోధ లేమిటి?" అని ఎవరయినా ఎదురుతిరిగి ప్రశ్నిస్తే దానికేమీ సమాధానం చెప్పలేరు. కాని, ఈ విధంగా తామేమీ సమాధానం చెప్పలేకపోయామనే అపఖ్యాతి రాకుండా తప్పించుకోడానికై వారంతా సామాన్యంగా తత్త్వవేత్తలందరినీ దుయ్యబట్టే ధోరణి మొదలు పెడతారు. మేఘాలలోను, పాతాళంలోను ఉన్న విషయాలను గురించి తత్త్వవేత్త లేవేవో కల్పనలుచేసి ప్రబోధాలు చేస్తారని దూషణ లారంభిస్తారు: ఈ తత్త్వవేత్తలకు దైవం లేడనీ, చెడ్డవన్నీ మంచివిగా చూపడమే వీరి పని అనీ ఏవేవో ఆరోపణలు చేస్తారు. తమ అజ్ఞానం అంతా బట్టబయలయిన సంగతి అంగీకరించడాని కిష్టంలేకే—వారిటువంటి ధోరణికి దిగుతారు. నిజానికి అసలు కథ అది! ఇటువంటివె వారసంఖ్యాకులు. వీరి దురాశా దురహంకారాలకు, జవసత్త్వాలకు ఒక హద్దూపద్దూ లేదు. తియ్యతియ్యని మాటలతో ఇతరుల మనసులు తిప్పివెయ్యడంలో వీరికి వీరే

సాటి! ఇటువంటి వారంతా ఒక సైన్యంలా సన్నద్ధులై నామీద లేనిపోని దోషా లెన్నెన్నో కల్పించి మీ అందరి చెవులలోను యిల్లు కట్టుకొని పోరారు. నా మీద దోషారోపణ కుపక్రమించిన మెలిటస్సు, ఎనిటస్సు, లైకన్ ఈ విధంగా నామీద విసుగు పడడానికి గల అసలు కారణం ఇది! కవీశ్వరుల వ్యవహారంలో నాకు, మెలిటస్సుకు ఇంతకు పూర్వమే విరోధం ఉన్నది. రాజకీయవేత్తల వ్యవహారం లోను, శిల్పుల వ్యవహారంలోను కూడా ఎనిటస్సుకు నాకు మధ్యన తగాదా వచ్చింది. ఇక లైకన్ శబ్దాలంకార శాస్త్ర వేత్తల విషయంలో నాతో తగాదా పెట్టుకొన్నాడు. ఈ ముగ్గురికీ నాతో ఈ విధంగా పేచీలేర్పడ్డాయి. వీరందరు చేసే అసంఖ్యాకమైన దోషారోపణలన్నిటికీ ఒక్క క్షణంలో సమాధానాలివ్వలేను. ఏథెన్సు పౌరులారా! ఉన్న యధార్థస్థితి ఇది. నేను మీ దగ్గర దాచిందేమీ లేదు. మభ్యపెట్టిందేమీ లేదు. అయినా, నేనీ విధంగా కుండబద్దలుగొట్టినట్టు మాట్లాడడం వల్లనే వారందరు నన్ను ద్వేషిస్తున్నారు. నేను కేవలం వాస్తవమే చెబుతున్నాననడానికి వారికి నా యెడల కలిగిన విద్వేషమే ఒక తార్కాణం. అసలు వారికి నేనంటే కిట్టక పోవడానికి ఇదే కారణం. నేటి విచారణకు ఇక ముందు జరగబోయే విచారణలకు మూల కారణం ఇదే.

నాపై దోషారోపణచేసిన వారిలో మొదటి వర్గంవారి ఆరోపణలన్నిటికీ తగిన సమాధానాలు చెప్పాను. ఇప్పుడిక రెండవ వర్గంవారి ఆరోపణలకు సమాధానా లిస్తున్నాను.

వీరికి మెలిటస్ నాయకుడు. తానొక సత్పురుషుడననీ, దేశ భక్తుడననీ అతడంటున్నాడు.

ఈతని వర్గంవారి ఆరోపణలకు కూడా నేనిప్పుడు సమాధానాలు చెప్పాలి. వారు చేసిన దోషారోపణలన్నీ పరిశీలిద్దాము. ఆ ఆరోపణలధోరణి ఇది. సోక్రటీస్ యువకులను పెడదారులు పట్టిస్తూ దుర్మార్గాలెన్నో చేస్తున్నాడు. రాజ్యంలో అందరు గౌరవించే దేవతలమీద అతనికి నమ్మిక లేదు. పైగా తానే కొంతమంది నూతన దేవతలను ప్రతిష్ఠించి వారిని గౌరవిస్తున్నాడు. మొత్తంమీద వారు నామీద చేసే నిందారోపణ లివి. ఇవన్నీ వేర్వేరుగా పరిశీలిద్దాము. నేను దుర్మార్గాలు చేస్తున్నానని యువకులను పెడదారులు పట్టిస్తున్నానని మెలిటస్ అంటున్నాడు. ఏథెన్సు నగరవాసులారా! ఆ మెలిటస్సే దుర్మార్గాలు చేస్తున్నాడని నేనంటున్నాను. అతని కంతగా పట్టింపేమీ లేని విషయాలలో ఏదో పెద్ద పట్టింపు ఉన్నట్టు నటిస్తున్నాడు. ఈ విధమైన నటనతోనే జనాన్ని న్యాయస్థానాని కీడ్చుకు రావాలని ప్రయత్నిస్తున్నాడు. అంతేగాని నిజంగా అతనికీ వ్యవహారంతో కొంచమైనా ఆసక్తి లేదు. దీని యాథార్థ్యం మీకిప్పుడే రుజువుపరుస్తున్నాను.

మెలిటస్ ! ఒకసారి నా ఎదటికి రా! నేను నిన్నొక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. యువకుల పురోభివృద్ధిని గూర్చి నీ వెప్పుడూ ఆలోచిస్తూ ఉంటావు! అవునా?

"అవును"

అయితే న్యాయాధిపతులతో ఆ యువకుల పురోభి వృద్ధికి కారకులెవరో చెప్పు! నీవు చాలా శ్రమపడి యువకు లను తప్పుదారిని పట్టించే వ్యక్తిని వెతికి పట్టుకున్నావు. నా మీద న్యాయాధిపతుల యెదుట దోషారోపణలు చేస్తున్నావు. అందుచేత యువకులను పైకి తీసుకువచ్చే వారిని గూర్చి న్యాయాధిపతులకు తెలియజెయ్యడం న్యాయం. మెలిటస్! నేను వేసినప్రశ్నకు సమాధానమేమీ చెప్పకుండా ఉలుక్కుండా పలుక్కుండా మాట్లాడక ఊరుకున్నావు! అసలీ వ్యవహారంలో నీ కేమాత్రం ఆసక్తి లేదనడానికిది ఒక గట్టి తార్కాణం కాదా? ఇది ఎంతయినా తలవంపు వ్యవహారం కాదా? మిత్రమా! యువకులకు పురోభివృద్ధి కలిగించేవారెవరో చెప్ప వయ్యా!

"ధర్మ సూత్రాలు"

నేనడిగిన దది కాదు మహాశయా! అటువంటి ధర్మ సూత్రాలవగాహన చేసుకొన్న వ్యక్తులెవరని ప్రశ్నిస్తున్నాను.

"సోక్రటీస్! ప్రస్తుతం న్యాయస్థానంలో ఉన్న న్యాయ మూర్తులే ఆ ధర్మ సూత్రాలవగాహన చేసుకొన్న వ్యక్తులు."

అయితే యువకులకు విద్యోపదేశం చేసి ఈ న్యాయాధి పతులు వారిని అభివృద్ధికి తీసుకువస్తున్నారనే నీఅభిప్రాయమా?

"అవును! తప్పకుండా యువకుల పురోభివృద్ధికీ న్యాయ మూర్తులు శాయశక్తులా దోహదం కలిగిస్తున్నారు."

అయితే వీరందరూ వారి పురోభివృద్ధికి దోహదం కలిగి స్తున్నారా? లేక, వీరిలో కొంతమందే ఆ పనిచేస్తున్నారా?

"అందరూ దోహదం కలిగిస్తున్నారు"

ఇక నేమి! ఇక్కడ వేంచేసిఉన్న ధర్మదేవత సాక్షిగా-ఇది చాలా ఆనందించదగిన విషయం! అయితే యువకుల పురోభివృద్ధికి దోహదం కలిగించే వారనేకులున్నారన్నమాట! మరి ఇక్కడి ప్రేక్షకుల మాట! వారు కూడా యువకుల పురోభివృద్ధికి దోహదం కలిగిస్తున్నారా?

"అవును. వారందరూ దోహదం చేస్తున్నారు."

ఇక శాసన సభ్యులో?

"వారు కూడా యువకుల అభివృద్ధికి సాయపడుతున్నారు."

అయితే ఏథెన్సు నగరవాసులందరూ యువకులను పైకి తీసుకు వస్తున్నారన్నమాట. నేనొక్కడనే వారిని తప్పుదారి పట్టిస్తున్నాను. నీవు చెప్పేదంతేనా?

"అవును! నేను గొంతెత్తి చెప్పేదదే!

నీవు చెప్పేదే నిజమయితే, నేను చాలా దురదృష్టవంతుణ్ణి. సరే, నిన్నిప్పుడొక ప్రశ్న అడుగుతున్నాను. అయితే మరి అశ్వాల మాటేమిటి? ఒక వ్యక్తి వాటికి చెడుగు చెయ్యడము, ఇక మిగిలిన ప్రపంచం అంతా మంచి చెయ్యడము జరుగుతున్నదా? దీనికి కేవలం వ్యతిరేకమే వాస్తవం కదా? ఒకే ఒక వ్యక్తి గుర్రాల కుపకరించగలడు. చాలా మంది వాటికి మంచి చెయ్యడం జరగదు. అంటే-అశ్వ శిక్షకుడి వల్ల అశ్వాలకు మంచి జరుగుతున్నది. ఇక ఆ గుర్రాల

నుపయోగించేవారివల్ల కొంతవరకు వాటికి చెడుపే జరుగు తున్నది. మెలిటస్! గుర్రాల విషయంలోనైనా, మరి ఏ ఇతర జంతువుల విషయంలోనైనా వాస్తవం ఇదేకదా? నీవూ, ఎనిటస్సూ అంగీకరించినా, అంగీకరించకపోయినా యథార్థం ఇంతే. ఒకే ఒక వ్యక్తి తప్పుదారిని పట్టించేవారూ, తదితరులు అంతా వారి పురోభివృద్ధికి శాయశక్తులా సాయంచేసేవారూ అయితే, యువకుల పరిస్థితి చాలా చక్కగా ఉన్నదన్నమాట! కాని నీవీ యువకుల అభివృద్ధి విషయమే పట్టించుకోవడం లేదని రుజువుచేసుకొన్నావు. అసలు నామీద చేసిన తీవ్రా రోపణలు వ్యవహారంలోనే నీకేమీ శ్రద్ధ లేదని తేలింది.

మెలిటస్! నిన్నిప్పుడింకొక ప్రశ్న అడుగుతున్నాను. దైవ సాక్షిగా ఈ ప్రశ్న అడగాలని నిశ్చయించాను. సజ్జనుల మధ్య నివసించడం మంచిదా? దుర్జనుల మధ్య నివసించడం మంచిదా? మిత్రమా! ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు. ఇది చాలా తేలికగా సమాధానం చెప్పడానికి వీలయిన ప్రశ్న. ఇరుగు పొరుగు వారికి సజ్జనుల వల్ల మంచి జరుగుతుంది. దుర్జనులవల్ల చెడుగు జరుగుతుంది. అంతేనా?

"అవును, నిజమే."

ఎవరైనా వ్యక్తి తన ఇరుగు పొరుగువారివల్ల ఉపకారం పొందవలెనని అనుకుంటాడా? లేక అపకారం పొందవలెనని అనుకుంటాడా? మిత్రమా! నేనడిగిన దానికి సరిగా సమా ధానం చెప్పు. న్యాయ శాస్త్రం ప్రకారం నీవు నా ప్రశ్నలకు

సమాధానం ఇవ్వవలసి ఉన్నది. అసలెవరికయినా ఒకరివల్ల అపకారం జరగాలని ఉంటుందా ?

"నీవన్నది నిజమే. ఎవ్వరికీ అటువంటికోరిక కలగదు."

ఇంకొక్క సంగతి. నేను యువకులను పాడు చేస్తున్నానని అంటున్నావు. నేనిదంతా చెయ్యాలని చేస్తున్నానా? లేక తలవని తలంపుగా చేస్తున్నానా ?

"చెయ్యాలని చేస్తున్నావనే అంటున్నాను."

అయితే, సజ్జనులు తమ ఇరుగుపొరుగు వారికి మంచి చేస్తారనీ దుర్జనులు చెడుగు చేస్తారనీ నీవిప్పుడే అంగీకరించావు. నాతో కలిసిమెలిసి ఉన్నవారిని నేను దుర్జనులుగా చేస్తే వారివల్ల నాకు తిరిగి అపకారమే జరుగుతుంది. నీకున్న అత్యధిక విజ్ఞానంతో ఈ సంగతి నీవిప్పుడే ఇంతటి చిన్న వయస్సులోనే గ్రహించానంటావా మెలిటస్ ! ఇక ఇంతటి వయస్సు చెల్లినా నేనింకా ఈ విషయం గ్రహించుకోలేనంతటి అజ్ఞానాంధకారంలోనే మునిగి ఉన్నానంటావా ? ఈ విషయాలన్నీ తెలిసి ఉండీన్నీ చెయ్యాలనే ఇవన్నీ చేశాననీ, నాతోడివారిని తప్పుడు దారి పట్టించాననీ నీవంటున్నావు ! అయితే నేను గాని మరి ఏ ఇతర వ్యక్తిగాని ఈ విధంగా నీవన్న మాటలు నమ్మడం జరగదు. ఇందువల్ల నాతో కలసి మెలిసి ఉన్న వారిని నేనసలు తప్పుదారి తొక్కించలేదనేనా అనాలి. లేక తలవని తలంపుగా తప్పుదారి పట్టించాననైనా అనాలి. ఈ రెండింటిలోనూ ఏది జరిగినా నీ వొక్కడ కేవలం

అసత్యాలే చెబుతున్నావు. నేనిది తలవని తలంపుగా చేసి ఉన్నట్లయితే, ఇది తప్పిదంగా పరిగణించడానికే వీలు లేదు. ఇటువంటి తప్పిదాలు న్యాయ శాస్త్ర రీత్యా దోషాలుగా భావించరు. న్యాయ శాస్త్రం ఇవి తప్పిదాలుగా గుర్తించదు. ఈ పరిస్థితులలో నీవు నన్ను పిలిచి ముందుగా హెచ్చరిక చేసి, ఇటువంటి పనులు చేయవద్దని చెప్పి ఉండవలసింది. అప్పుడీ విధంగా చేసే పనులు చెయ్యడం మాని వేసి ఉందునేమో. అదే మంచిదని తోస్తే తప్పక నేనా పూర్వధోరణి విరమించి ఉందును. అయితే నీవు నాకీ విధంగా బోధించి ఉండలేదు. కాని నన్నీ న్యాయ స్థానాని కీడ్చుకు వచ్చావు. ఇది విచారణ చేసి శిక్షించే ప్రదేశం గాని, సదుపదేశం చేసే స్థలం కాదు.

ఏథెన్సు పౌరులారా! మెలిటస్ అసలు ఈ వ్యవహారం అంటే ఏ విధంగా నూ శ్రద్ధ పట్టలేదని నేనింతకు పూర్వం మీతో అన్నాను. ఇది మీకిప్పుడు బాగా స్పష్టపడుతుంది. మెలిటస్! మళ్లీ నిన్నొక మాట అడుగుతున్నాను. నేను యువకులను తప్పుదార్లు పట్టిస్తున్నానని అన్నావుకదా. ఏ వ్యవహారంలో వారిని చెడు తోవలు తొక్కించాను? నీ దోషారోపణ ధోరణిని బట్టి నేనది ఇలాగ ఊహిస్తున్నాను: మన రాజ్యం గౌరవించే దేవతలను గుర్తించవద్దనీ, వాటికి బదులుగా మరి కొందరు దేవతలను గాని, దివ్యసాధనాలను గాని గుర్తించి గౌరవించ వలసిందనీ నేను యువకులకు బోధించి వారిని పెడదారులు పట్టించాను. ఇదేనా నీవు నాపై చేసే నిందారోపణ?

"అవును. అదే నేను నొక్కి వక్కాణిస్తున్నాను."

మెలిటస్! మన మిప్పుడు దేవతలను గూర్చి ప్రసంగిస్తున్నాము. అందుచేత దైవ సాక్షిగా నాకూ, న్యాయాధిపతులకూ విస్పష్టంగా తెలిసే తేటమాటలతో నీ అభిప్రాయమేదో వివరించి చెప్పు! అసలు నీ దోషారోపణ ఏమిటో నాకింకా తిన్నగా బోధపడలేదు. నేను కొంతమంది దేవతలనే గుర్తించి గౌరవించవలసినదని బోధిస్తున్నానా? అదే నీవంటే, అందుచేత నాకు కొంతమంది దేవతలపైన నమ్మకం ఉన్నదన్నమాట. నేను పూర్తిగా నాస్తికుణ్ణి కాదన్నమాట. నామీద నీ విటువంటి నిందారోపణ చెయ్యాలనే అనుకుంటున్నాను. మన రాజ్యం అంగీకరించని వేరే దేవతలను గౌరవించ వలసినదని నేను బోధిస్తున్నానన్నావు. ఇదేనా నీవు చేసే దోషారోపణ? లేక, నేను కేవలం నాస్తికుణ్ణనీ, నాస్తికత్వమే బోధిస్తున్నాననీ ఆరోపణ చేస్తున్నావా?

"నీవు పూర్తిగా నాస్తికుడవనే నేనంటున్నాను."

ఇది ఎంతటి అసాధారణమైన అత్యద్భుత ప్రకటన! మెలిటస్! నీవీ ధోరణిలో ఎందుకాలోచిస్తున్నావో నాకు బోధపడడంలేదు. మిగిలిన వారంతా సూర్య చంద్రులలో దైవత్వం ఉన్నదని నమ్ముతున్నారనీ, నాకటువంటి నమ్మకం లేదనీ నీ అభిప్రాయమా?

"న్యాయాధిపతులారా! సోక్రటీస్ కటువంటి నమ్మిక లేదని నొక్కి వక్కాణిస్తున్నాను. సూర్యుడొక శిల అనీ, చంద్రుడు భూమి వంటి వాడనీ అతడంటున్నాడు."

మిత్రమా! మెలిటస్! ఎనగ్సాగోరస్‌పై దోషారోపణ చేస్తున్నానని అనుకొంటున్నావు. ఇటువంటి సిద్ధాంతాలన్నీ ఎనగ్సాగోరస్, క్లాజో మెనియను లిద్దరు వ్రాసిన పుస్తకాల నిండా కనిపిస్తున్నాయి. ఈ స్వల్పవిషయం కూడా న్యాయాధిపతులకు తెలియదనీ. వారంతటి అక్షరజ్ఞాన శూన్యులనీ నీవనుకొంటే- వారి యెడల నీకు చాలా చెడ్డ అభిప్రాయం ఏర్పడినదన్నమాట. ఇంకొక విషయం. నాటకశాలలలో ఈ సిద్ధాంతాల నపహసించి దుయ్యబట్టే రూపకాలాడుతున్నారు. బాగా తక్కువ డబ్బు ఖర్చుతోనే అవి చూడవచ్చునే! ఇటువంటి పరిస్థితులలో నేనే ఈ విచిత్ర సిద్ధాంతాలన్నీ సృష్టించావనీ ప్రచారం చేస్తున్నాననీ నీవారోపిస్తున్నావే! నేనే గనక ఆ ప్రచారం సాగించిన పక్షంలో ఆ నాటకాలు చూచి వచ్చిన యువకులు నన్ను చూచి నవ్వరా? సరేగాని మెలిటస్! నాకు దేవతలమీద నమ్మకంలేదని నిజంగానే భావిస్తున్నావా?

"నీకే దేవతమీద ఏవిధమైన భక్తి విశ్వాసాలు లేవని నేను దైవసాక్షిగా ప్రమాణంచేసి చెబుతున్నాను."

మెలిటస్! నీవు చెప్పేది ఎవ్వరు నమ్మరు! అసలు ఏవన్నదానిమీద నీకే నమ్మకం లేదని నా దృఢ విశ్వాసం.

ఏథెన్స్ పౌరులారా! మెలిటస్ వెనక ముందు లాలోచించకుండా ఇష్టంవచ్చినట్టు నామీద నిందారోపణచేశాడు. ఇక తనకే సర్వస్వము తెలుసునన్న దురహంకారంతోనే ఈ పనికి పూనుకొన్నాడు. ఆ ధోరణితోనే నిందారోపణ పత్రం తయారు చేశాడు. నన్ను విచారింపజేసి శిక్షిద్దామని అభి

ప్రాయంతో పరస్పర విరుద్ధమయిన విషయాలతో విచిత్ర ప్రశ్నలు కొన్ని సృష్టించాడు. ఇవ్వన్నీ సృష్టించేటప్పుడతడు నేనివి గ్రహించగలనో లేదో చూద్దామని అనుకున్నాడు. లేకపోతే నన్నూ, మిమ్మల్నీ మోసగించాలనైనా అనుకొని ఉంటాడు. కాని మెలిటస్ సృష్టించిన ఆరోపణ పత్రంలో పరస్పర విరుద్ధ విషయాలున్నాయి. అతని పత్రధోరణి పరిశీలిస్తే నాకు దేవతలపైన నమ్మికలేనట్లు, అందుచేత దోషినయినట్లు, మళ్ళీ నాకా దేవతలపై నమ్మిక ఉన్నట్లు కూడా కనబడుతున్నది. ఇది నిజాయితీగా వ్యవహరించే వ్యక్తులవలంబించదగిన పద్ధతికాదు.

ఏథెన్సు నగరవాసులారా! నేనిప్పుడు మెలిటస్ ఆరోపణలలో గల పరస్పర విరుద్ధ విషయాలు వివరిస్తాను. ఈ విషయంలో మీరందరు నాతో సహకరించగలరని ఆశిస్తున్నాను. మెలిటస్! నేనడిగే ప్రశ్నల కన్నిటికీ సమాధానాలిస్తావని ఆశిస్తున్నాను. నాధోరణిలో నేను ప్రసంగిస్తున్నప్పుడు నా ప్రసంగానికి విఘాతం కలిగించవద్దని ప్రేక్షకులందరినీ ఇదివరకొకమారు ప్రార్థించాను. అదే తిరిగి ఇంకొకమారు జ్ఞాపకం చేస్తున్నాను.

మెలిటస్! ఏ వ్యక్తికయినా మానవులకు సంబంధించిన విషయాల మీద నమ్మకం ఏర్పడి, మానవుల మీద నమ్మకం లేకపోవడం జరగగలదా?

ఏథెన్సు పౌరులారా! నేనడిగిన వాటికి తిన్నగా సమాధానాలు చెప్పకుండా ఏవేవో అసందర్భమయిన అడ్డ

డిడ్డపు మాటలతోనే మెలిటస్ కాలక్షేపం చేస్తున్నాడు. ఇక ఇప్పుడయినా సరి అయిన సమాధానాలిస్తాడని ఆశిస్తున్నాను.

మెలిటస్! ఒక వ్యక్తి గొప్ప గుఱ్ఱపు రౌతని అనుకుందాము. అతని కసలు అశ్వాల అస్తిత్వం మీాదనే నమ్మక లేకపోవడం సంభవిస్తుందా? వేణుగానంలో నమ్మక ఉన్న వారికి పిల్లన గ్రోవి ఊదే వారిపై నమ్మకం లేకుండా పోతుందా? మిత్రమా! నీ వీప్రశ్నకు సమాధానం చెప్పడానికి నిరాకరిస్తున్నావు, కనక నేనే నీకూ, న్యాయస్థానానికీ ప్రత్యుత్తరం ఇస్తున్నాను. ఇలాంటి వెన్నడూ జరగ లేరవు. తిరిగి ఇంకొక ప్రశ్న అడుగుతున్నాను. దయచేసి సమాధానం ఇవ్వవలసిందని కోరుతున్నాను. దేవతలకు సంబంధించిన విషయాలు విశ్వసించే వ్యక్తికి దేవతలపైనే విశ్వాసం లేకపోవడం సంభవమా?

"సంభవం కాదు."

అమ్మయ్య! ఈ న్యాయస్థానం సాహాయ్యంతో చిట్ట చివరి కీవిధమైన సమాధానం రాబట్టగలిగాను. నిజంగా నేనెంతో అదృష్టవంతుణ్ణి. దోషారోపణ పత్రంలో దేవతలకు సంబంధించిన విషయాలు నేను నమ్ముతున్నాననీ, వాటిని ప్రబోధిస్తున్నాననీ అన్నావు. (కొత్తదేవతలో, పాతవాళ్లో-ఆవిషయం వేరేఉంచు) ఏమైనా నాకు దేవతలంటే నమ్మకం ఉన్నది. అలా అని నువ్వు దోషారోపణ పత్రంలో రాశావు. అలాంటప్పుడు దైవాంశ సంభూతులను నమ్మకుండా ఉండడ మెలాగ? నమ్మితీరవలెను గదా? మానాన్నిబట్టి నీ వీ విష

యంలో నాతో ఏకీభవిస్తున్నావని భావిస్తున్నాను. దేవాంశ సంభూతులనగా ఎవరు? దేవతలనో, దేవతల కుమారులనో దేవాంశ సంభూతులని అంటున్నాము. అవునా? కాదా?

"అవును నిజమే!"

కాని, ఈవిషయంలో చిక్కుసమస్య ఒకటి సృష్టించావు. నీ వంగీకరించినట్లు దైవాంశ సంభూతులు దేవతలే కదా! కాని, మొట్టమొదటగా దేవతలంటే నాకు నమ్మకంలేదని ఆరోపణ చేశావు. దేవాంశ సంభూతులంటే నాకు నమ్మకఉన్నది కనక దేవతలమీద కూడా నమ్మకం ఉన్నదని, అటుపిమ్మట అంగీకరించావు. దేవతాంశలతో ఉద్భవించిన దేవతలు సంకర జాతి దేవతలే కావచ్చును. అప్సరసలకో, తదితర స్త్రీలకో వారు జన్మించి ఉండవచ్చును. అంతమాత్రంచేత అసలు దేవతలే లేరంటే ఎవరయినా నమ్ముతారా? కంచరగాడిద లున్నాయని అంగీకరించి, గుర్రాలు గాడిదలు లేవన్నట్టున్నది ఈ ధోరణి. నన్ను విచారణచేసి శిక్షించడానికని ఇలాంటి అసందర్భ ధోరణి నీవే సృష్టించాలి. ఇంకెవరూ ఇటువంటి అభూత కల్పనలు చేయజాలరు. నిజంగా నాలో తప్పులెన్నడానికేమీ లేక, ఇలాంటి అవకతవక విషయాలన్నీ కల్పించావు. ఇవన్నీ ఆరోపణల పత్రంలో చేర్చావు! ఏమాత్రం అవగాహన శక్తి ఉన్నా ఎవరూ నీ ఆరోపణలు నమ్మరు.

మెలిటస్ చేసిన ఆరోపణలపై చెప్పవలసినదంతా చెప్పాను. ఆత్మరక్షణకోసం ఈ విషయంలో ఇంతకంటె ఎక్కువ చెప్పడం అనవసరం. అయితే ఇంకా నా కెన్నెన్నో శత్రుత్వా

లేర్పడ్డాయి. నా కా శత్రుత్వాల సంగతి బాగా తెలుసును. ప్రాణాపాయమే కలిగే పక్షంలో నిజంగా నా వినాశనానికి ప్రపంచానికి నా మెడల ఏర్పడిన అసూయా ద్వేషాలే కారణం. మెలిటస్‌గాని, ఎనిటస్‌గాని దీనికి కారణం కాదు. ఈ విధమయిన అసూయా ద్వేషాలకు ఇంతకు ముందెందరో సత్పురుషు లాహుతి అయిపోయారు. బహుశః ఇంకా అనేకు లాహుతి కాగలరు. వీరిలో నేనే తుది వ్యక్తిని అయే ప్రమాదం లేదు.

"ఈ విధంగా అకాల మరణానికి దారి తీసే జీవిత పంథా అనుసరించడానికి నీకేమీ కించ కలగడం లేదా? సోక్రటీస్!" అని మీలో ఎవరయినా ప్రశ్నించవచ్చును. వారికి నేనిచ్చే సమాధానం ఇది: "ఈ విషయంలో మీరు పొరబడుతున్నారు. సత్సంకల్పం కలిగినప్పుడు సజ్జను లెప్పుడూ జీవితావకాశాలను గురించీ, మరణావకాశాలను గురించీ మీనమేషాలు లెక్కిస్తు కూర్చో కూడదు. నేను మంచి చేస్తున్నానా? చెడ్డ చేస్తున్నానా? అని మాత్రమే ఆలోచించాలి. మీ ధోరణినిబట్టి చూస్తే ట్రాయ్ యుద్ధ రంగంలో మరణించిన వీరులంతగా మంచివారు కారన్నట్టు తోస్తూంది. * థెటిస్ కుమారుడందరికన్నా ఎక్కువగా వీర విహారం చేశాడు. నలుగురిలోను అవమాన పడటంకంటే

* థెటిస్, అకిలస్ థెటిస్ దేవత కుమారుడు. అతని సహచరుడు పాట్రోక్లాస్ ట్రాయ్ సమరానికి ముందే మరణించాడు. దీనికి ప్రతీకారం చెయ్యాలని నిశ్చయించి అకిలస్ ట్రాయ్ రాజు ప్రియ కుమారుడు హెక్టరును యుద్ధంలో చంపివేశాడు.

ప్రాణాలర్పించడమే సర్వోత్తమమని భావించాడు. అతడు హెక్టరును చంపివెయ్యాలని తహతహపడుతూంటే దేవతా మూర్తి అతని కూత "నాయనా, నీ సహచరుడు పాట్రో క్లూస్‌ను చంపివేసినందుకు ప్రతిగా హెక్టరును సంహరించాలని అనుకుంటున్నావు. కాని, హెక్టరును చంపివేసిన తరువాత నీవుకూడా చనిపోతావు. జాగ్రత్తసుమా!" అని హెచ్చరిక చేసింది. అయినా అతడా హెచ్చరిక లక్ష్యపెట్టలేదు. మృత్యువునైనా లక్ష్యపెట్టకుండా నిర్భయంగా నిలబడ్డాడు. అపాయం కన్న, మృత్యువు కన్న ప్రతిజ్ఞ చెల్లించుకోలేని బ్రతుకే అత్యంతము దుర్భరమని భావించాడు. అందుచేత తల్లికి "అమ్మా! నలుగురిలోను నవ్వులపాలై ఈ భూతలాని కంతటికీ భారభూతంగా బతికిఉండడం కంటె, నా శత్రువునిపై పగ తీర్చుకొని ఆ వెనువెంటనే మరణించడమే మేలు" అని సమాధానం ఇచ్చాడు. అకిలస్ మహావీరుని కావద అన్నా, మృత్యువన్నా ఏ మాత్రమయినా భయం ఉన్నదా? ఒక వ్యక్తి ఏ స్థానంలో నిలబడి ఉంటే ఆ స్థానంలోనే ఉండాలి. అపాయ సమయంలో కూడా అది విడిచిపెట్టకూడదు. ఆస్థానం స్వయంగా ఎన్నుకొన్నదయినా సరే! లేక, సైన్యాధిపతి నియ మించినదయినా సరే! అది ఎన్నడూ విడిచిపెట్టకూడదు. తన కవమానం కలుగుతుందేమోనని భయపడాలిగాని, అసలిక మృత్యువును గూర్చి ఆలోచించనే కూడదు. ఏథెన్స్ నగర వాసులారా! ఇది ముమ్మాటికీ యథార్థం.

పోటిడే, అంఫిపోలిస్, డెలియమ్ యుద్ధాలలో మీా అందరిచేత నియుక్తులయిన సైన్యాధిపతులు నన్నాయా

ప్రదేశాలలో నిలబడి పోరాడ వలసిందని ఆజ్ఞాపించారు. నేను వారందరి ఆజ్ఞలను యథాతథంగా అనుసరించాను. అనుచరులతో కూడి, శత్రువులతో శాయశక్తులా పోరాటం సాగించాను. నిర్భయంగా మృత్యుదేవత నెదుర్కొన్నాను. ప్రస్తుతం పరమేశ్వరుడు నన్నొక ప్రత్యేక కార్యక్రమం నెరవేర్చ వలసిందని ఆజ్ఞాపించాడు. ఇతరులలోని, నాలోని లోపాలను నిశితంగా పరిశీలించే తాత్త్విక ఉద్యమమే ఆ ప్రత్యేక కార్యక్రమం. ఆ పరమేశ్వరుని ఆజ్ఞ ప్రకారమే ఈ తత్త్వవేత్త ధర్మం నిర్వర్తిస్తున్నాను. మృత్యు భయం వల్ల గాని, తదితర భయాల వల్ల గాని ఈ ధర్మ నిర్వహణలో వెనుకంజ వేస్తే, నా ప్రవర్తన చాలా విచిత్రంగా మారిపోయిన దన్నమాట. అప్పుడు నన్ను న్యాయస్థానాని కీడ్చి, దేవతలు ఉన్నట్టు నాకు నమ్మకం లేదని న్యాయస్థానంలో నా మీద దోషారోపణ చెయ్యవచ్చును. అప్పుడది సబబే అవుతుంది. మృత్యువంటే భయపడితే, దైవవాణిని ఉల్లంఘించినట్లే; అజ్ఞానంలో ఉంటూ, విజ్ఞానినని విర్రవీగినట్లే. దైవాన్ని వ్యతిరేకించినందుకు న్యాయస్థానంలో నేరారోపణ చెయ్యడంలో తప్పేమీ లేదు.

మృత్యువంటే భయపడడం విజ్ఞానుల మనుకునేవారు చేసేపనే కాని, నిజమయిన విజ్ఞానులు చేసేపని కాదు. దీనికి కారణం ఇది: మృత్యువు నిజ స్వరూపం ఎవరికీ తెలియదు. సామాన్యంగా మానవులంతా మృత్యువొక మహానర్థమని భావిస్తారు. ఒకవేళ అది మానవుని కొక మహోపకార మయినా కావచ్చును. కాని, ఈ విషయం ఇదమిత్థంగా ఎవరికీ తెలియదు. అలాంటప్పుడు దానిని గురించి భయపడడం

కేవలం అజ్ఞత. తెలియనిది తెలుసునని నటించడ మొక గొప్ప అజ్ఞత, ఆత్మవంచన కాదా? ఇటువంటి వాటి సందర్భాలలోనే నాకు, మిగిలిన వారికి కొంచెం తేడా ఉన్నదని అనుకుంటున్నాను. "బహుశః వారి కంటె నేనే విజ్ఞుడనేమో" అని కూడా అనుకుంటాను. భూగర్భంలో ఏముందో నాకు తెలియదు. అలాంటప్పుడు నాకా విషయం తెలుసునని అనుకోను. దైవానికి గాని, మానవులకు గాని చేసే అన్యాయము, అగౌరవము, చాలా గొప్ప తప్పిదాలని నాకు తెలుసును. అందుచేత ఎల్లప్పుడూ మంచి సాధించడానికే శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఈ విషయంలో నేనేమాత్రమూ వెనుకంజ వెయ్యను. భయపడను.

నాపై నిందారోపణ సందర్భంలో దోషం నిర్ధారణ అయింది కనుక నాకు ఉరిశిక్ష విధించవలసిందే నని అనిటస్ అన్నాడు. లేకపోతే అసలు నాపై ఈ ఆరోపణలు చెయ్యాడమెందుకని ప్రశ్నించాడు. ఈ శిక్ష తప్పించుకొన్న పక్షంలో మీ కుమారులంతా నా ప్రసంగాలు విని నాశనమై పోతారు అని కూడా అనడొక హెచ్చరిక చేశాడు. మీలో ఎవరయినా నాతో ఈ విధంగా అనవచ్చును. "సోక్రటీస్! ఈసారికి మాత్రం మేము అనిటస్ మాట లక్ష్య పెట్టదలచుకోలేదు. నిన్ను విడిచిపెట్టివెయ్యవలెననే అనుకుంటున్నాము. అయితే ఒక షరతుమీదనే నిన్ను విడిచి పెడుతున్నాము. నీ ప్రస్తుత తాత్త్విక ధోరణి పూర్తిగా పరిత్యజించాలి. మళ్ళీ ఇల్లాంటి పని గనక చేస్తే ఇక నీకు మరణ శిక్షే!"

ఇదే నిజమైనయితే, ఎవాకందరికీ నేనిచ్చే సమాధానం ఇది. 'ఏథెన్సు పౌరులారా! మీ అందరియెడల నాకెంతో గౌరవం ఉన్నది. అయితే నేను పరమేశ్వరాజ్ఞ పాటిస్తాను గాని మీ ఆజ్ఞ పాటించను. నా శరీరంలో ప్రాణం ఉన్నంత వరకు, జవసత్వాలున్నంతవరకు నా తత్త్వశాస్త్ర బోధనలు విరమించ దలచుకోలేదు. ఎదురుపడ్డ వారెవరితో నయినా నాకు అలవాటయిన ధోరణిలోనే ప్రసంగిస్తాను. ఏథెన్సు నగరంలో కనబడిన ఏ వ్యక్తినయినా నేనిలాగ హెచ్చరిస్తాను. "మిత్రమా! నీవు ఏథెన్సు నగర పౌరుడవు, ఇది విజ్ఞానానికి పేరెక్కిన మహానగరం, నిత్యము ఐశ్వర్యము, కీర్తి ప్రతిష్ఠలు, గౌరవము అపారంగా సంపాదించుకోవాలని తాపత్రయ పడుతున్నావు. ఇవన్నీ బాగా అభివృద్ధి పొందించుకొన్నా ఇంకా వీటికోసం రాత్రింబవళ్ళలాగే తాపత్రయపడుతున్నావు. అంతేగాని నిజమైన విజ్ఞానము, సత్య దృష్టి, ఆధ్యాత్మిక ఔన్నత్యము అభివృద్ధి పొందించుకోవాలని ఆలోచించడమే లేదు! అసలు నీ వీ విషయాలే లక్ష్యపెట్టడం లేదు. దీనికి నీవేమీ కించపడడం లేదా?" అని అడుగుతాను.

ఆ వ్యక్తి నాతో "అవును! నా కవి కావాలి, అవి కావాలనే అనుకొంటున్నాను" అని సమాధానం చెప్ప వచ్చును. అలాగన్నంతమాత్రాన నేనతన్ని విడిచిపెట్టను. తిరిగి అతని ననేక విధాలుగా ఎదురు ప్రశ్నలు వేసి పరీక్షిస్తాను. సమాధానాలు విని మళ్ళీమళ్ళీ పరీక్షిస్తాను. అతని దగ్గర సద్గుణాలేవీ లేవనీ, ఉన్నాయని ఊరికే అంటున్నాడనీ తోస్తే, నేనతనిని మందలిస్తాను. ఆ వ్యక్తి గొప్పవనుకుంటున్నవి

కావనీ, అల్పమయిన వనుకుంటున్న సద్గుణాలే గొప్పవనీ హెచ్చరిస్తాను. పెద్దలయినా సరే! పిన్నలయినా సరే! స్వదేశ పౌరులయినా సరే! విదేశీయులయినా సరే! ఎవ రెదురు పడినా వారందరితోను పైన చెప్పిన విధంగానే నా ప్రసంగం ప్రారంభిస్తాను. తత్రాపి, ఏథెన్స్ పౌరులు నా సోదరులు కనుక వారి కీ మాటలు నొక్కి నొక్కి వక్కాణిస్తాను. ఇది కేవలం ఈశ్వరాజ్ఞ. ఇటువంటి ఈశ్వర సేవకంటె గొప్ప దేమీ నా కీ రాజ్యంలో గోచరించ లేదు. చిన్న వారైనా, పెద్దవారైనా మీ అందరినీ హెచ్చరించడం కంటె నాకు వేరేకార్యాంతర మేమీ లేదు. ఆస్తిపాస్తులను గురించి, మిమ్మల్ని గురించి పట్టించుకోవద్దనీ, మొట్టమొదటగా మీమీ ఆధ్యాత్మికాభివృద్ధిని గురించి శాయశక్తులా ప్రయత్నించ వలసిందనీ ప్రబోధిస్తూంటాను. ఈ విధంగా హెచ్చరిస్తూ ప్రబోధించడంకంటె నేను వేరే చేసేపని ఏమీ లేదు. ధనం వల్ల సుగుణాలు ఎన్నడూ అలవడవు. కాని, సుగుణాలవల్ల ధనమూ ఇతర ప్రయోజనాలూ వస్తాయి. అంతేకాదు, సుగుణాలవల్ల ఆయా వ్యక్తులకే గాక, సామాన్యంగా అందరికీ అనేకవిధాల మంచి జరుగుతున్నది. నేను ప్రజా సమూహానికి చేసే ఉపదేశా లివి. ఈ సిద్ధాంతాలు, యువకులను తప్పుడు దారులు పట్టించే పక్షంలో నేను దుర్మార్గుణ్ణే. అసలు నేను బోధించే దిది కాదని ఎవరైనా అంటే, వారనేది కేవలం అసత్యం.

ఏథెన్స్ నివాసులారా! మీరు అనిటస్ చెప్పినట్టు చేసినా సరే. చెయ్యకపోయినా సరే! నాకు శిక్ష విధించినా

సరే! విడిచిపెట్టినా సరే! నా ప్రసంగ ధోరణిని నే నెన్నటికీ మార్చను. అనేకమారులు మరణశిక్ష లెదుర్కోవలసివచ్చినా సరే! నా పంథా విడిచిపెట్టను. దీనికిక తిరుగు లేదు !

ఏథెన్సు పౌరులారా! నా ప్రసంగాని కడ్డు తగలకండి. దయచేసి నేను చెప్పేది శ్రద్ధగా వినండి. నా ప్రసంగం అంతా శాంతంగా వినాలని మీరూ నేనూ ఒప్పందం చేసుకొన్నాము. ఇంకా చెప్పవలసింది చాలా ఉన్నది. అది వింటూంటే గట్టిగా కేకలు పెట్టాలని మీకు కనిపించవచ్చును. కాని, కొంచెం ఓపిక పట్టి అదంతా కొనసాగుతూ వినడం మీ కందరికీ మంచిదని నా అభిప్రాయం. అందువల్ల మున్ముందుకూడా కేకలు వెయ్యవద్దని కోరుతున్నాను. నా వంటి వ్యక్తిని మీ రంతా కలిసి చంపించి వేస్తే, దానివల్ల నా కంటే మీకే ఎక్కువ అపకారం జరగగలదు. ఈ విషయం జాగ్రత్తగా గమనించవలసినదని కోరుతున్నాను. మెలిటస్ గాని, అనిటస్ గాని నా కపకృతి చెయ్యలేరు. వీరే గాదు. ఇంకెవ్వరూ నాకపకారం చెయ్యలేరు. ఒక చెడ్డ వ్యక్తి తన కంటె మంచి వ్యక్తి కెన్నడూ చెడుగు చెయ్యలేడు. అనిటస్ తనకంటె ఉత్తమ వ్యక్తిని హతమార్చి వెయ్యవచ్చును. లేక అతనికి ప్రవాస శిక్ష విధించవచ్చును. లేక, అతని పౌరసత్వానికి సంబంధించిన హక్కులన్నీ తొలగించి వెయ్యవచ్చును. అనిటస్సు, తదితరులు కలిసి ఆ వ్యక్తికి గొప్ప వేదన కలిగించామని అనుకోవచ్చును. అక్కడే పొరపాటు పడుతున్నారు. అన్యాయంగా ఇంకొకవ్యక్తి ప్రాణాలు తియ్యడంవల్ల– ఆ దుష్కృత్యం చేసే వ్యక్తికి వచ్చే హాని

యింకా పెద్దది. అనిటస్ ఇటువంటి అకృత్యం చేస్తున్నాడు. ఇదంతా మీరు జాగ్రత్తగా గమనించ వలసిన విషయం. ఏథెన్స్ పౌరులారా! నాకోసమే మీ సేనీ వాదన చెయ్యడం లేదు. ఇదంతా కేవలం నా కోసమే చేస్తున్నానని మీరనుకో వచ్చును. కాని, నన్ను శిక్షిస్తే మీరంతా ఆ పరమేశ్వరుని యెడల అపరాధం చేసినావారవుతున్నారు! ఆయన నన్ను మీ కొరకు కానుకగా సమర్పించాడు. కనుక మీ కోసమే నే నిదంతా నొక్కి నొక్కి సకార్యుణిస్తున్నాను.

మీరంతా కలిసి నన్ను చంపివేస్తే, నా వంటి వ్యక్తి మరొకడు మీకు లభించడం చాలాకష్టం. ఇప్పుడు చెప్పబోయే ఉపమానం అసంగర్భంగా కనిపించవచ్చును. నే నొకవిధమైన కందిరీగ వంటి వాణ్ణి. ఇటువంటి నన్ను పరమేశ్వరుడు ఈరాజ్యం కోసం ప్రసాదించాడు. ఈ విశాల రాజ్యం ఒక మహాశ్వం వంటిది. ఇందువల్లనే దీనికి అడుగు చాలా మందంగా పడు తున్నది. కనకనే ఇది ముమ్ముందుకు సాగలేకపోతున్నది. దీనిని వడివడిగా నడిపించడం చాలా అవసరం. ఈ రాజ్యాశ్వాన్ని శీఘ్రంగా నడిపించడానికే భగవంతుడు నన్నేర్పాటు చేశాడు. ఇందువల్లనే రాత్రి, పగలు అనకుండా ఎక్కడబడితే అక్కడ మిమ్మల్ని అందరినీ అనేక విధాల హెచ్చరిస్తున్నాను. నా వంటి వ్యక్తి ఇంకొకడు లభించడం దుర్ఘటం. కనుక నన్ను విడిచిపెట్టవలసిందని కోరుతున్నాను. హఠాత్తుగా మేల్కొలి పితే నిద్రపోయేవారికి కోపంవస్తుంది. మీ రిప్పు డలాగే ఉన్నారు. అనిటస్ సలహాప్రకారం నన్నొక్క దెబ్బతో చంపి వెయ్యవచ్చునని అనుకుంటున్నారు. ఆ పైన జీవితాంతము

హాయిగా కళ్ళు మూసుకొని నిద్రపోవచ్చునని మీ అభిప్రాయం. భగవంతుడు మిమ్మల్ని మేల్కొలపడానికి కందిరీగ వంటి వ్యక్తి నెవరినైనా ఇంకొకరిని పంపకపోతే మీరా విధంగా గాఢనిద్రలో పడి మైమరచి ఉండవచ్చును. పరమేశ్వరుడు మీకోసం నన్నొక కానుకగా ఇచ్చాడని ఇంతకుపూర్వం అన్నాను. నా ఉద్యమంలో గల యాథార్థ్యం ఇప్పుడు తెలియజేస్తున్నాను.

నేనుకూడా మిగిలిన మానవులలాగ ప్రవర్తిస్తే, నాకు సంబంధించిన సొంత వ్యవహారాలను గురించి అశ్రద్ధచేసి ఉండను. మాటిమాటికీ మీదగ్గిరికి వచ్చి హెచ్చరిక చేస్తూ మీ పనులన్నీ పాడుచేసి ఉండను. సహోదరునివలె మీ సన్నిధికివచ్చిసద్గుణా లలవరచుకో వలసిందని అనేకవిధాలుగా హెచ్చరించాను. ఈ విధమయిన ప్రబోధంవల్ల నాకేమయినా ప్రతిఫలం ముట్టిఉంటే, దానిలో కొంత అర్థం ఉండేది. అసందర్భంగా నా మీద దోషారోపణ చేసిన వారుకూడా నే నెవరి దగ్గరగాని ప్రతిఫలం స్వీకరించానని ఆరోపించలేక పోయారు. అందుకు వారికి సాక్ష్యంచెప్పేవారు లేరు. ఈ సంగతి మీ రంతా గ్రహించే ఉంటారు. అదీగాక నేను కేవలం లేమితో బాధపడుతున్నాను. నా మాటలలోని సత్యం నిర్ధారణ చెయ్యడానికి నా దారిద్ర్యమే కావలసినంత సాక్ష్యం. నే నెప్పుడూ వ్యక్తులకే సలహాలిస్తూ నా కాలం అంతా ఆ విధంగానే గడుపుతున్నాను. అంతేగాని రాజ్య పరిపాలనను గూర్చి బహిరంగంగా కలుగజేసుకుని, ప్రభుత్వానికి సలహా లేవీ యివ్వడం లేదు. ఇది చాలమంది కాశ్చర్యం కలిగించి ఉంవ

వచ్చును. దీనికిగల కారణం మీకు తెలియజేస్తున్నాను. అనేక మారు లనేక ప్రదేశాలలో నా లోలోపల వినిపించే దివ్యవాణిని గూర్చి ప్రస్తావించాను. ఆ దివ్యవాణి నా అంత రాంతరాలలో అప్పుడప్పుడు ప్రతిధ్వనిస్తూఉంటుంది. మెలిటస్ తన దోషారోపణ పత్రంలో దీనినిగూర్చే అపహాస్యంచేశాడు. బాగా పసితనంలోనే నాకీ దివ్యవాణి వినిపించేది. ఏదైనా ఒక అకార్యం చేయబోతూంటే- అది చెయ్యవద్దని ఆ దివ్య వాణి ప్రబోధిస్తుంది. అంతేగాని ప్రత్యేకంగా ఒకపని చెయ్యా వలెనని నిర్దేశించదు. నేను రాజకీయవేత్తగా వ్యవహరించక పోవడాని కిదే కారణం. ఈ దివ్యాదేశం సముచితమైనదే అని నా అభిప్రాయం. రాజకీయాలలోనే గనక ప్రవేశించి ఉంటే, నాకుగాని, మీకుగాని ఏమీప్రయోజనం కలిగి ఉండేదికాదు. పైగా, చాలాకాలం క్రితమే నేనా రాజకీయాల్లోపడి నశించి పోయేవాణ్ణి. ఉన్నది ఉన్నట్టుగా యధార్థం మీ ఎదట ఉంచాను. దీనికి మీ రన్యథా భావించి బాధపడకండి! ఈ రాజ్యంలో అనేకమైన అన్యాయాలు జరుగుతున్నాయి. అనేక మైన అపభ్రంశపు పనులు జరుగుతున్నాయి. ఈ అకార్యా లను గురించి మీతోగాని, అధికసంఖ్యాకు లెవరితోగాని ఎదు రుగా నిలబడి పోరాడే వ్యక్తి ప్రాణాలతో బ్రతికి బయట పడడు! అసలు ఉన్న యధార్థం ఇది! చాలా స్వల్పకాలమే జీవించినా, న్యాయంకోసం పోరాడే వారెప్పుడూ అనధికార వ్యక్తులుగానే ఉండిపోవాలిగాని రాజ్యములో పదవులేవీ స్వీకరించకూడదు.

నేను చెప్పేదానికి విశ్వసనీయమైన రుజువొకటి చూపించగలను. నోటి మాటలకు సంబంధించిన రుజువు కాదిది. మీ రందరూ హర్షించే కార్యాచరణకు సంబంధించినది. నేనిప్పుడు చెప్పబోయేది నా జీవితంలో ఒక ఘట్టం. మృత్యువునైనా లక్ష్యపెట్టకుండా నిర్భయంగా అన్యాయాని కెదురుగా నిలిచి నేను పోరాడి ఉండవలసినదేనని - ఇది విన్నతరవాత మీకు కనిపిస్తుంది. ఇది న్యాయస్థానానికి సంబంధించిన గాథ. బహుశః ఇంత ఆసక్తితో వినడానికి దీనిలో ఏమీ లేకపో వచ్చును. కాని గాథ మాత్రం యథార్థం. ఏథెన్సు పౌరులారా! నేనసలు ప్రభుత్వానికి సంబంధించిన ఒకే ఒక పదవి స్వీకరించాను. అది శాసన సభ్యత్వం. మాది ఆంటియోకిస్ తెగ అని మీకు తెలుసును. ఆర్గినూసే * యుద్ధం ముగిసిన తరవాత మన సైన్యాధిపతులు కొందరు రణరంగంలో చనిపోయిన వారి శరీరాలు స్వాధీనపరచుకోలేదు. దానిపై జరిగిన సైన్యాధిపతుల విచారణ సమయంలో అధ్యక్షాధికారం వరస ప్రకారం మా తెగవారికి వచ్చింది. మీ రా సైన్యాధిపతు

* ఆర్గినూసే. ఆర్గినూసే ద్వీపాల సమీపంలో జరిగిన నౌకాయుద్ధంలో ఏథెన్సు నగరవాసులు స్పార్టా వాసులను ఓడించివేశారు. ఆ యుద్ధంలో శత్రువులు ఏథెన్సువాసుల నౌకలను కొన్నిటిని సముద్రంలో ముంచివేశారు. వాతావరణ పరిస్థితి బాగుండక పోవడంవల్ల, ఆ నౌకలలో పనిచేసే కళాసుల్ని కొందరిని రక్షించడానికి వీలు పడలేదు. ఆ సమయంలో అక్కడ ఉన్న సైన్యాధిపతులే దానికి కారణమని, వారిలో కొందరిమీద నేరారోపణ చేశారు. మొత్తంమీద ఆరుగురికి ఈ విధంగా మరణశిక్ష విధించారు.

లందరినీ మూకుమ్మడిగా విచారించాలి అని అన్నారు. అది న్యాయ సూత్ర విరుద్ధం. ఆ విషయం తరువాత మీరుకూడా అంగీకరించారు. అప్పుడేర్పడిన ప్రైటనీ * సంఘసభ్యులలో నేను ఒక్కణ్ణే న్యాయసూత్ర విరుద్ధంగా విచారించడం అనుచితమని అన్నాను. అంతేకాదు. ఆ విషయంలో మీ కందరికీ వ్యతిరేకంగా ఓటు చేశాను. దానిమీద అప్పుడు ప్రసంగించిన వ్యక్తు లందరికీ నా మీద ఆగ్రహం కలిగింది. నన్ను నిర్బంధించి విచారణ చెయ్యాలని వారందరూ నొక్కి వక్కాణించారు. మీరుకూడా అదే ధోరణిలో కేకలుపెట్టి గందరగోళం చేశారు. ఆ సమయంలో మీతో వ్యతిరేకించడం వల్ల కారాగారశిక్ష, మరణశిక్ష —రెండూ ఒక్కసారిగా నా మీద విరుచుకు పడేవే. కాని, వాటికి భయపడి మీరుచేసే అన్యాయంలో పాల్గొన దలచలేదు. న్యాయం, ధర్మం నా పక్షాన ఉన్నాయి. అందుచేత మరణశిక్షపడినా సరే, మీ కందరికీ వ్యతిరేకంగానిలబడాలనే నిశ్చయించాను. ఆసంఘటన ప్రజాస్వామ్యం అమలులో ఉన్న రోజులలో జరిగింది. అటు పిమ్మట 30 మంది అల్పసంఖ్యాకులు ♦ రాజ్యాధికారం తమ హస్తగతం చేసుకొన్నారు. నన్ను, మరి నలుగురిని తమ సన్ని

* ప్రైటనీ.ప్రైటనీ అంటే 50 మంది సభ్యులుగల సంఘం. ఒక నెలరోజుల వరకు ఈ సంఘం ఏథెన్స్‌లో గ్రామసభకు కార్యనిర్వాహకవర్గంలా వ్యవహరిస్తుంది.

♦ 30 మంది నియంతలు. స్పార్టా, పెర్షియాలు రెండూకలసి ఏథెన్స్‌ను ఓడించివేసినప్పుడు క్రీస్తుపూర్వం 411 లో అల్పసంఖ్యాకవర్గ విప్లవం చెలరేగింది. అనంతరం 30 మంది నియంతలు స్వల్పకాలం గ్రీసులో తమ పరిపాలన కొనసాగించారు.

ధికి రావలసిందని వారాజ్ఞాపించారు. మేమంతా అక్కడికి వెళ్ళాము. సలామిస్‌నుంచి లియాన్‌ను నిర్బంధించి తీసుకు రావలసిందని మా కుత్తరువు లిచ్చారు. అతన్ని చంపివెయ్యాలని వారి సంకల్పం. తాము చేసే దుష్కృత్యాలలో సాధ్యమైనంతవరకు చాలామందిని ఇరికించాలనే వారి కుతంత్రం పన్నారు. వారి దుశ్చర్యల కిది ఒక ఉదాహరణ.

మృత్యువంటే తృణప్రాయం అని,మాటలవల్లేకాక, నా చేతలవల్లకూడా స్పష్టంగా నేనా సమయంలో వ్యక్తంచేశాను. ఏదైనా అన్యాయం నా వల్ల జరగగలదేమోనన్న భయం ఒకటే నా ప్రధాన సమస్య అని కూడా నొక్కి వక్కాణించాను. అప్పుడా అల్పసంఖ్యాకులకు సర్వాధికారాలూ హస్తగతమై ఉన్నాయి. వా రేదిచేసినా దానికిక తిరుగులేదు. అయినా నేను భయపడలేదు. ఆ అన్యాయాని కొడికట్టలేదు. మేమందరము ప్రభుత్వ భవనంలో నుంచి తిరిగి వచ్చాము. మిగిలిన నలుగురు సలామిస్ వెళ్ళి లియాన్‌ను బంధించి తీసుకువచ్చారు. నేను మరి ఆ గొడవే తలపెట్టకుండా తిన్నగా ఇంటికి వెళ్ళిపోయాను. పిమ్మట స్వల్పకాలంలోనే ఆ అల్ప సంఖ్యాకుల పరిపాలనను తుదముట్టించడం జరిగింది. లేకపోతే నాకు మరణ దండన పడవలసిందే. నేను చెప్పేవాటికి చాలా మంది సాక్షులున్నారు.

ఇన్నాళ్ళనుంచీ నేను న్యాయపక్షమే వహించి పని చేశాను. ధర్మంకోసం పోరాడడం నా ప్రథమ కర్తవ్యమని భావించాను. ఎటువంటి విషయంలోనైనా ధర్మ దృష్టితోనే

ప్రవర్తించాను. నేనే కనక ప్రభుత్వపదవి చేపట్టి ఉంటే, ఇంత కాలం ఇలాగ ప్రాణాలతో బతికి బయట పడగలననే మీరూహిస్తున్నారా? అది ఎన్నటికీ జరిగి ఉండదు. నేనే కాదు, మరి ఏ వ్యక్తి అయినా, ఈ పాటికి రాజకీయాలకు బలిఅయి ఉండవలసిందే. ప్రజాహితవ్యవహారాలలోను, వ్యక్తిగత విషయాలలోను కూడా నే నెప్పుడూ ఒక విధంగానే వ్యవహరించాను. కొంతమందిని నా శిష్యులని దుష్ప్రచారం చేస్తున్నారు. వారుగాని, తదితరులుగాని, చేసే దుశ్చర్యలకు, దురాలోచనలకు నేనెన్నడూ లొంగిపోలేదు. అదేగాక నాకు శిష్యులని చెప్పదగ్గవారెవరూ లేరు. అయితే నా ధోరణిలో నా ఉద్యమంసాగిస్తూండగా, పెద్దలుగాని, పిన్నలు గాని నా దగ్గిరికి వచ్చి, నా ప్రసంగాలు వినదలచుకుంటే అటువంటి వారి నెవ్వరినీ నేను తిరస్కరించలేదు. అదీ గాక కేవలం ధనం ప్రతిఫలంగా ఇచ్చినవారితో నే ప్రసంగించడం ఎన్నడూ జరగ లేదు. ధనవంతులయినా, దరిద్రులయినా నన్ను ప్రశ్నించవచ్చును. తిరిగి నా ప్రశ్నలకు సమాధానాలివ్వవచ్చును. నేను చెప్పేది శ్రద్ధగా ఆలకించవచ్చును. నా ప్రసంగం విన్నవారు సజ్జనులుగా మారినా, దుర్జనులుగా మారినా దానికి నేనే హేతువని అనడం న్యాయంకాదు. నేనై ఎవరికీ ఎన్నడూ ప్రత్యేకంగా బోధించిందేమీ లేదు అలాగ ఒకరికి బోధిస్తున్నానని నేనెన్నడూ నిర్దేశించి చెప్పలేదు. చెప్పేదేదో అందరికీ బహిరంగంగానే చెబుతూ వచ్చాను. అలాగ కాకుండా, ఏకాంతంలో నా దగ్గర ఏదో నేర్చుకున్నామని కాని, విన్నామని కాని, ఎవరేనా అంటే – అది కేవలం అబద్ధం.

అయితే ఎడ తెరపి లేకుండా జనం చాలామంది ఆ విధంగా నాతో ప్రసంగిస్తూ ఉండడానికి కారణమేమని ఎవ రయినా ప్రశ్నించవచ్చును. పౌరులారా! ఈ విషయంలోగల యథార్థమంతా మీ కింతకుపూర్వమే విశదం చేశాను. కొంతమంది తామే సర్వజ్ఞులమని అహంకరిస్తూ ఉంటారు. ఎదురుప్రశ్నలు గుప్పించి వారి బండారం బయటపెట్టడమంటే చాలామంది శ్రోతల కెంతో ఇష్టం. అదిగాక, దానిలో కొంత వినోదంకూడా ఉన్నది. ఈ విధంగా అడ్డుప్రశ్నలు వేసి ఇతరు లను పరీక్షించే వ్యవహారం అంతా ఆ పరమేశ్వరుడే నా కేర్ప రచాడు. సామాన్యంగా ఈశ్వరసంకల్పం దివ్యవాణి, దివ్య దృశ్యాలు మొదలయిన వాటిద్వారా సువ్యక్తం అవుతుంది. నా కిది ఈ విధంగానే వ్యక్తమయింది. ఏథెన్సు పౌరులారా! ఇదంతా అక్షరాలా యథార్థం కాకపోతే, నిజం నిలకడమీాద తేలుతుంది.

యువకులను తప్పుదారులు పట్టిస్తున్నానని అన్నారు. తమ చిన్నతనంలో నేను దుర్బోధలు చేశానని గుర్తించిన పెద్దలిప్పుడు ముందుకు వచ్చి నిలబడి నా మీాద నిందారోపణ కుపక్రమించ వలసిందని కోరుతున్నాను. అటువంటి వారొక వేళ ముందుకువచ్చి నిలబడడాని కిష్టపడకపోతే, వారితండ్రులు సహోదరులు, ఇంకా మిగిలిన జ్ఞాతులు మొదలయిన బంధు వులు నా ఎదట నిలబడి నా వల్ల వారివారి కుటుంబాల కెటు వంటి అపకారాలు జరిగాయో విశదంగా వివరించి చెప్ప వచ్చును. వారందరికీ ఇదే తగిన సమయము. అలాంటి వా రెందరో నా కిప్పుడు ఈ న్యాయస్థానములో కనిపిస్తున్నారు.

అదిగో అక్కడ క్రిటో కనిపిస్తున్నాడు. మేమిద్దరం సమాన వయస్కులం. ఒకే ప్రదేశంలో ఇరుగుపొరుగులముగా ఉంటున్నాము. అతని కుమారుడు క్రిటోబ్యూలస్ కూడా ఇక్కడే ఉన్నాడు. అదిగో ఆ ప్రక్కన ఎస్కెన్స్ తండ్రి లైసేనియాస్ కనబడుతున్నాడు. ఇంకొకచోట ఎపిజీన్స్ తండ్రి ఏంటిఫన్ కూర్చొని ఉన్నాడు. ఇదేగాక, నాతో కలిసి మెలిసి తిరిగిన వారి సోదరులెందరో ఈ న్యాయస్థానంలో ఉన్నారు. అదిగదిగో! ఆమూల నికోస్ట్రాటస్ కనబడుతున్నాడు. థియోజోటిడస్ కుమారుడు అతడు. థియోడోటస్ అతనికి సహోదరుడు. ఆ థియోడోటస్ చనిపోయాడు. కనక ఇప్పుడిక నిజం చెప్పకుండా నికోస్ట్రాటస్‌ను అడ్డుపెట్టేవారెవరూ ఉండరు. డెమోడోకస్ కుమారుడు, థియేజస్ సోదరుడు అయిన పారలస్ కూడా ఇక్కడే ఉన్నాడు. ఇదిగో! ఈ మూల అరిస్టన్ కొడుకు ఎడైమాంటస్ కనబడుతున్నాడు. అతని సోదరుడు ప్లేటో కూడా ఇక్కడే ఉన్నాడు. వీరేగాక అపోలోడోరస్ సోదరుడు ఈన్‌టోడోరస్ కూడా ఇక్కడే ఉన్నాడు. ఇలాగే ఇక్కడివారిని ఇంకా చాలామందిని పేర్కొనగలను. తన దోషారోపణ ప్రసంగం ముగిసిన తరువాత మెలిటస్ వీరిలో కొందరి నయినా సాక్షులుగా పేర్కొని ఉండవలసింది. అతడొకవేళ మరిచిపోతే, మించిపోయినదేమీ లేదు. ఇప్పుడయినా వీరిని పిలిచి సాక్షులుగా పరీక్షించవచ్చును. ఈ ప్రసంగం విరమించి నేనతనికా అవకాశం కలిగిస్తాను. పోనీ తనకేదైనా మరొక సాక్ష్యం ఉంటే అతడది ఇక్కడ పేర్కొనవచ్చును. పౌరులారా! నిజానికలాంటి సాక్ష్యాలు, సంపన్నాలు ఏవీ

లేవు! మెలిటస్ను, ఎనిటస్ను, కలిసి నేను యువకులను పెడదారులు పట్టించానని ఆరోపించారు. కాని ఆ యువకుల తలిదండ్రులు మొదలయిన పెద్దలంతా నా పక్షున నిలబడి నిజానిజాలు చెప్పడానికి సిద్ధంగా ఉన్నారు. ఆ విధంగా నా వల్ల పాడై పోయారన్న యువకులే కాదు, పాడై పోకుండా ఉన్న పెద్దలు, తల్లిదండ్రులు మొదలయిన బంధువులుకూడా నా వైపు సాక్ష్యం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు. వీరందరూ నేను యథార్థమే చెబుతున్నానని, మెలిటస్ కేవలం అబద్ధాలాడుతున్నాడనీ, గుర్తించారు. కేవలం న్యాయం కోసం, సత్యసంరక్షణకోసం సాక్ష్యం చెప్పడానికి ఇక్కడకు వచ్చారు. లేకపోతే వారంతా నాకీ విధంగా ఆసరాగా నిలబడవలసిన అవసరం ఏమి ఉన్నది?

ఏథెన్స్ పౌరులారా! నేను స్వరక్షణకోసం చెప్పగలిగినదంతా ఇంతే! అయినా ఇంకొక్కమాట! ఇప్పుడు నేనున్న పరిస్థితులలో ఇతఃపూర్వం కొంతమంది వలవల విలపిస్తూ శిక్షలు తగ్గించవలసినదనీ, రద్దుపరచవలసిందనీ న్యాయాధిపతులను ప్రార్థించి ఉండవచ్చును. అంతేకాక పిల్లలుగల వారమని చెప్పి, న్యాయాధిపతుల ఎదటికి తీసుకొని వచ్చి, చూపి ఉండవచ్చును. ఇంకా వారివారి బంధువులు, స్నేహితులుకూడా ఇక్కడికివచ్చి న్యాయాధిపతులను ప్రార్థించి బతిమాలి ఉండవచ్చును. ఆ విధంగా చేస్తే ఎటువంటి వారికయినా హృదయం ద్రవించడం సహజం. నేనిప్పుడు చాలా ప్రమాదకరమైన పరిస్థితిలో ఉన్నానని మీరందరూ ఎరుగుదురు. అయినా ఇటువంటి పని ఏమీ చెయ్యడం లేదు.

ఇందువల్ల వెనక ఆ విధమయిన పనులు చేసి న్యాయాధిపతు లను ప్రార్థించిన వారికి నా నడవడి కిట్టకపోవచ్చును. వారు నామీద అక్కసు కొద్దీ విచారణలో నాకు వ్యతిరేకంగా వోటు వేయవచ్చును. అలాంటి వారెవరూ ఇక్కడ లేరనే అనుకుంటున్నాను. కాని, ఒక వేళ ఉన్నపక్షంలో వారికి ఈ విధంగా సమాధానం ఇస్తున్నాను.

"నేను మనిషిని. మిగిలిన వారి లాగే రక్తమాంసా లున్న వ్యక్తిని. అంతేగాని హోమరు మహాకవి ఒక సందర్భంలో పేర్కొన్నట్లుగా "రాయినీ రప్పనూ" కాను. నాకు ముగ్గురు కుమారులు. వారిలో మొదటివాడు కొంచెం చేతి కంది వచ్చాడు. మిగిలిన వాళ్ళిద్దరు ఇంకా చిన్నవాళ్లు. అయినా నన్ను విడిచిపెట్టవలసిందని మిమ్మల్ని ప్రార్థించడం కోసం వారి నెవరినీ ఇక్కడకు తీసుకురాదలుచుకోలేదు. 'ఏం? ఎందుకు తీసుకు రాకూడదు?' అని ఎవరికయినా స్ఫురించ వచ్చును. అహంభావం చేతగాని, మీయెడల గౌరవ లోపం వల్లగాని నేనీ విధంగా ప్రవర్తించడంలేదు. నాకు మృత్యు భయం ఉన్నదా? లేదా? అన్నది వేరే ప్రశ్న. దానిని గురించి నేనిప్పుడు ప్రస్తావించను. ప్రజాభిప్రాయం గౌరవించే వ్యక్తిని నేను. నా పిల్లలను న్యాయస్థానం లోపలికి తీసుకు రావడం నాకుగాని, మీకుగాని, మన దేశానికి గాని గౌరవ ప్రదంకాదు. నేను బాగా పెద్దవాణ్ణయ్యాను. వేత్తననీ, విజ్ఞానిననీ పేరు పొందాను. ఇటువంటి వ్యక్తి దీనంగా,నీచంగా ప్రవర్తించడం సముచితం కాదు. సోక్రటీసు ఒక విధంగా మిగిలిన వారికన్నా గొప్పవాడని ప్రపంచం నిశ్చయించింది.

ఈ అభిప్రాయం సముచితమైనా కాకపోయినా ఇలాంటిభావం ఒకటి ఏర్పడిఉన్నది. విజ్ఞానంలోను, సాహసంలోను ఇంకా ఇతర గుణాలలోను ఇతరులకన్న అధికులని పేరెన్నిక గన్న మీలో ఎవరయినా న్యాయస్థానంలో ప్రవేశించి న్యాయాధిపతుల సమక్షంలో నైచ్యానికి దిగితే అది ఎంత తలవంపు! పెద్ద పేరు ప్రతిష్ఠలున్నవారు శిక్షలు పడగానే న్యాయస్థానంలో ఎంతో నీచంగా, అగౌరవంగా ప్రవర్తించటం నేనెరుగుదును. చనిపోతే చాలా భయంకరమైన యాతన లేవో అనుభవిస్తామనీ, జీవించనిస్తే ఇక అమరుల మైపోతామనీ భావిస్తూ ఉంటారు, ఆ వ్యక్తులు. ఏథెన్సు నగరానికటువంటి వారి వల్ల ఎంతయినా అప్రతిష్ఠ కలుగుతున్నదని నా అభిప్రాయం. పౌరులంతా గౌరవించి ఆదరించే అటువంటివారి నైచ్య ధోరణి పై దేశాలవారెవరయినా పరిశీలిస్తే, ఆ భీరువులు, స్త్రీలకన్నా అన్యాయంగా ఉన్నా' రని అంటారు. కొంచెం పేరు ప్రతిష్ఠలున్న పెద్దమనుష్యు లెవరూ అటువంటి దైన్యానికీ, నైచ్యానికీ సిద్ధపడకూడదు. ఒకవేళ ఎవరైనా అలాగ దిగజారి పోతే మీరు దాని కంగీకరించ కూడదు. ఏడుపు మొగం పెట్టి పిల్లలను చూపించి న్యాయస్థానంలో బీభత్సంగా వ్యవహరించి మన నగరానికి అప్రతిష్ఠ కలిగించే వారిని, తదితరుల కన్న ఎక్కువగా శిక్షించడమే మా అభిమతమని మీరందరూ వ్యక్తం చెయ్యాలి.

ప్రజాభిప్రాయం మాట అటుంచినా, న్యాయమూర్తులను కాళ్ళావేళ్ళా పడి ప్రార్థించి, ఆ విధంగా శిక్ష పడకుండా విడుదల పొందడం చాలాతప్పు. విషయాలన్నీ పూర్తిగా

వివరించి న్యాయం తనవైపు ఉన్నదని వారికి నచ్చచెప్పి ఆ ప్రకారంగా విడుదల పొందడమే సరియయిన పద్ధతి. ఇష్టం వచ్చిన వారిని విడిచిపెట్టడం కాదు న్యాయమూర్తులు చెయ్యవలసిన పని. సాక్ష్యం అంతా జాగ్రత్తగా పరిశీలించి నిష్పక్షపాతంగా తీర్పు చెప్పడమే వారనుసరించవలసిన మార్గం. ధర్మసూత్రాల ప్రకారం విచారణ జరిపి తీర్పులిస్తామనీ, ఇష్టానిష్టాలను బట్టి తీర్పు లివ్వమనీ న్యాయాధిపతులంతా ప్రమాణాలు చేశారు. దీనికి వ్యతిరేక ధోరణిలో న్యాయాధిపతుల నెంతమాత్రం ప్రోత్సహించకూడదు. న్యాయమూర్తులారా! మీరటువంటి తప్పుడు ప్రోత్సాహాలకు లొంగిపోకూడదు. ఈ విధంగా ప్రోత్సహించడం కేవలం న్యాయ సూత్రాలకు వ్యతిరేకమయిన వంచనేగాని మరేమీకాదు. దానిలో దైవభక్తి, ధర్మనిష్ఠ ఉన్నాయని అనుకోవడం వట్టి భ్రమ. దైవభక్తి బొత్తిగా శూన్యమని నామీద మెలిటస్ ఒక ఆరోపణ చేశాడు. ఈ వ్యవహారంలోనే ఇప్పుడు విచారణ జరుగుతున్నది. ఇలాంటి తరుణంలో దైవ విరుద్ధము, అగౌరవకరము అయిన తప్పుడుపని నేను చేయను. ఆ విధంగా మీకు కోరడం న్యాయం కాదు. ఏథెన్సు పౌరులారా! మీరు కొన్ని పవిత్ర ప్రమాణాలకు కట్టుబడి ఉన్నారు. ప్రార్థించి, బతిమాలి బామాలి ఏదో విధంగా పవిత్ర ప్రమాణా లుల్లంఘింపజేయడం న్యాయం కాదు. అలాగ చేస్తే, అసలు దేవతలే లేరని మీకు బోధిస్తున్నా నన్నమాట. దేవతలు లే రన్నానని నామీద చేసిన ఆరోపణకు నేనే ప్రోద్బలం కలిగిస్తున్నా నన్నమాట. నా నిర్దోషిత్వం రుజువు చేసుకోడానికి బదులుగా

దోషినని అంగీకరిస్తున్నానన్న మాట. కాని, నా ఉద్దేశ్యం అది కాదు. దేవతల ఉనికిపై నాకు గట్టినమ్మకమే ఉన్నది. నాపై దోషారోపణలు చేసేవాడు విశ్వసించే దేవతలకన్నా మహత్తరులు వాడు!

ఏథెన్సు పౌరులారా! న్యాయాధిపతులారా! మీకూ ఆ పరమేశ్వరునికీ నా ఉద్యమ వ్యవహారం సమగ్రంగా నివేదించుకొన్నాను.

ఇక, మీకూ నాకూ సముచితమైన ధోరణిలో తామీ విషయంలో నిర్ణయం చెయ్యవచ్చును.

*    *    *    *    *

ఏథెన్సు పౌరులారా! నన్ను దోషిగా నిర్ణయిస్తూ వోటుచేశారు. దీనికి నేనేమీ చలించకుండా విచారించకుండా ఉండడానికి చాలా కారణాలున్నాయి. ఇలాగ జరుగుతుందని నేను ముందే అనుకున్నాను. అయితే వ్యతిరేకంగానూ అనుకూలంగానూ పడిన వోట్లు చాల వరకు సమానంగా ఉండడం నాకాశ్చర్యం కలిగించింది. ఎన్నో ఎక్కువ వోట్లు నాకు వ్యతిరేకంగా పడగలవని అనుకున్నాను. ఇవతలి పక్షం వారికి 30 * వోట్లు ఎక్కువగా వచ్చి ఉంటే, నేను విడుదల పొంది ఉండేవాణ్ణి. మెలిటస్ కు దొరకకుండా బయటపడి ఉండేవాణ్ణి అని కూడా అనుకోవచ్చును. అంతేకాదు. అనిటస్, లైకనుల ఆసరా లేకపోతే న్యాయ శాస్త్రం ప్రకారం మొత్తం వోట్లలో రావలసిన ♦ అయిదవ భాగం వోట్లు కూడా మెలిటస్ కు వచ్చి ఉండేవి కావు.

ఇప్పుడితడు నాకు మరణ శిక్ష విధించాలని ప్రతిపాదిస్తున్నాడు. ఇక నేనొక ప్రతిపాదన చెయ్యవలసి ఉన్నది. పౌరులారా! ఏ విధమైన ప్రతిపాదన చెయ్యమంటారు ? స్పష్టంగా నాకు ముట్టవలసిన ప్రతిఫలాన్ని నేను కోరుకోవాలి.

* 30 వోట్లు: మొత్తం ఇక్కడ ఐదు వందల మంది వోటర్లున్నారు. సోక్రటీస్ కు వ్యతిరేకంగా 280 వోట్లు వచ్చాయి. వీటికి 30 వోట్లు తక్కువయితే ఉభయపక్షాల వారికీ సరిసమానంగా వోట్లు వస్తాయి.

♦ అయిదవ వంతు వోట్లు: నిందారోపకులు మెలిటస్, అనిటస్, లైకనులు ముగ్గురూ కలిసి 280 వోట్లు సంపాదించారనీ వీరిలో ఒక్కొక్కరు 93 వోట్లకోసం బాగా జాగ్రత్తపడ్డారనీ భావిస్తున్నట్టుగా సోక్రటీస్ ప్రసంగిస్తున్నాడు.

నిజంగా నాకు ముట్ట వలసిన ప్రతిఫలం ఏమిటి? ఇంతవరకు నేనొక క్షణంకూడా వ్యర్థంగా కాలక్షేపం చెయ్యలేదు. ధన ధాన్యాలు, కుటుంబ వ్యవహారాలు, సైన్యాధికార పదవులు, న్యాయస్థానాధికారాలు, ఉన్నత పదవులు, విందులు మొదలయిన వాటికోసం చాలామంది తాపత్రయ పడుతూంటారు. నేనీ వ్యవహారాలంటే బొత్తిగా పట్టించుకోలేదు. ఇను మిక్కిలిగా నిజాయితీతో వ్యవహరించడాని కలవాటు పడడం వల్లనే నేనసలు రాజకీయాల జోలికే పోలేదు. ఏ పనిచేసినా, మీకు, నాకు సత్ఫలితాలు కలగాలనే, ఆశించాను. మీకు గాని, నాకు గాని చెడు జరగగలదని తోచినప్పుడిక అటువంటి వ్యవహారాల జోలికే పోలేదు. మీలో ప్రత్యక్షంగా ప్రతి ఒక్కరికీ ఎంతో ఎక్కువగా మంచి కలిగించే కార్యాలే చేశాను. తమతమ స్వార్థా లటుంచి, అందరూ సచ్ఛీలము, విజ్ఞత అలవరుచుకోవాలనీ, ప్రభుత్వం వల్ల లభించే లబ్ధిమాట అటుంచి, ప్రభుత్వ శ్రేయోభివృద్ధికే ప్రవర్తించాలనీ హెచ్చరించాను. నా ప్రయత్నా లన్నిటిలోను ఈ దృక్పథమే అవలంభించాను. అటువంటి వ్యక్తి కేవిధంగా ప్రతిఫలం ఇవ్వాలి? పౌరులారా! న్యాయంగా ఆ వ్యక్తికి సముచితమయిన ప్రతిఫలం ఇవ్వాలికదా! మీకుపకరిస్తూ, మీకు సదుపదేశాల కోసం తగినంత అవకాశం కావాలని ఆశించే పేదవాడికి సరి అయిన ప్రతిఫలం ఏమిటి? ప్రత్యేకంగా గౌరవ జీవనభృతి ఏర్పాటు చెయ్యడమే– దీనికి తగిన బహూకృతి. ఒలింపియా ఉత్సవాలలో గుర్రపు పోటీలోనూ, రథాల పోటీలోనూ గెలిచిన పౌరుల కీ విధంగా గౌరవ భృతి ఏర్పాటు చేస్తున్నారు. ఆ

రథాలకు రెండు గుర్రాలు కట్టినా, చాలా గుర్రాలు కట్టినా, ఆయా పందాలలో గెలుచుకొన్నవారికి గౌరవ బహూకృతు లిస్తున్నారు. ఏథెన్సు పౌరులారా! గౌరవ బహూకృతికి వారందరికన్నా ఎక్కువ అర్హతే నాకు ఉన్నది. నేను లేమిలో ఉన్నాను. ఆయా పందాలలో గెలుపొందేవారికి సామాన్యంగా ఏ లోటూ లేకుండా కాలక్షేపం అవుతూంటుంది. ఒలింపియా ఉత్సవాలలో విజేతలు మీ కందరికీ ఆనందాభాసం మాత్రమే కలిగిస్తారు. నేను మీ కందరికీ యథార్థానందమే అందిస్తున్నాను. న్యాయంగా నాకు విధించవలసిన శిక్ష విధించాలంటే- గౌరవ జీవనభృతి ఏర్పాటు చెయ్యడమే సరియైన పద్ధతి.

న్యాయాధిపతులను బతిమాలుకోవడం తగని పని అని నేనింతకు పూర్వం అన్నప్పటిలాగే-ఇప్పుడుకూడా దుస్సాహసంతో ప్రసంగిస్తున్నానని మీ రందరూ భావించవచ్చును. కాని అది సరికాదు. నే నెవరికీ చెయ్యాలని అపకారాలేవీ చెయ్యలేదనే ప్రగాఢ విశ్వాసంవల్ల ఇంత ధైర్యంగా మాట్లాడుతున్నాను. ఈ విషయం మీచేత ఒప్పించలేకపోవచ్చును. కాని ఉన్న యథార్థం ఇది. అదీగాక, నాకున్న అవకాశం చాలా తక్కువ. మిగిలిన నగరాలలో మరణశిక్ష వ్యవహారం ఒక్కరోజులోనే పరిష్కరించకూడదనే నియమం ఒకటి ఉన్నది. ఏథెన్సులో కూడా అలాంటి నియమమే ఉంటే, తప్పకుండా మిమ్మల్ని అందరినీ ఒప్పించి ఉండేవాణ్ణి. పెద్దపెద్ద నిందలెన్నెన్నో నామీద మోపారు. అవన్నీ ఇంత స్వల్పకాలంలో అసత్యాలని రుజువుపరచి మీకు నమ్మిక కలిగించడం చాలా

నిజంగా నాకు ముట్ట వలసిన ప్రతిఫలం ఏమిటి? ఇంతవరకు నేనొక క్షణంకూడా వ్యర్థంగా కాలక్షేపం చెయ్యలేదు. ధన ధాన్యాలు, కుటుంబ వ్యవహారాలు, సైన్యాధికార పదవులు, న్యాయస్థానాధికారాలు, ఉన్నత పదవులు, విందులు మొదలయిన వాటికోసం చాలామంది తాపత్రయ పడుతూంటారు. నేనీ వ్యవహారాలంటే బొత్తిగా పట్టించుకోలేదు. ఇను మిక్కిలిగా నిజాయితీతో వ్యవహరించడాని కలవాటు పడడం వల్లనే నేనసలు రాజకీయాల జోలికే పోలేదు. ఏ పనిచేసినా, మీకు, నాకు సత్ఫలితాలు కలగాలనే, ఆశించాను. మీకు గాని, నాకు గాని చెడు జరగగలదని తోచినప్పుడిక అటువంటి వ్యవహారాల జోలికే పోలేదు. మీలో ప్రత్యక్షంగా ప్రతి ఒక్కరికీ ఎంతో ఎక్కువగా మంచి కలిగించే కార్యాలే చేశాను. తమతమ స్వార్థా లటుంచి, అందరూ సచ్ఛీలము, విజ్ఞత అలవరుచుకోవాలనీ, ప్రభుత్వం వల్ల లభించే లబ్ధిమాట అటుంచి, ప్రభుత్వ శ్రేయోభివృద్ధికే ప్రవర్తించాలనీ హెచ్చరించాను. నా ప్రయత్నా లన్నిటిలోను ఈ దృక్పథమే అవలంభించాను. అటువంటి వ్యక్తి కేవిధంగా ప్రతిఫలం ఇవ్వాలి? పౌరులారా! న్యాయంగా ఆ వ్యక్తికి సముచితమయిన ప్రతిఫలం ఇవ్వాలికదా! మీకుపకరిస్తూ, మీకు సదుపదేశాల కోసం తగినంత అవకాశం కావాలని ఆశించే పేదవాడికి సరి అయిన ప్రతిఫలం ఏమిటి? ప్రత్యేకంగా గౌరవ జీవనభృతి ఏర్పాటు చెయ్యడమే– దీనికి తగిన బహూకృతి. ఒలింపియా ఉత్సవాలలో గుర్రపు పోటీలోనూ, రథాల పోటీలోనూ గెలిచిన పౌరుల కీవిధంగా గౌరవ భృతి ఏర్పాటు చేస్తున్నారు. ఆ

రథాలకు రెండు గుర్రాలు కట్టినా, చాలా గుర్రాలు కట్టినా, ఆయా పందాలలో గెలుచుకొన్నవారికి గౌరవ బహూకృతు లిస్తున్నారు. ఏథెన్సు పౌరులారా! గౌరవ బహూకృతికి వారందరికన్నా ఎక్కువ అర్హతే నాకు ఉన్నది. నేను లేమిలో ఉన్నాను. ఆయా పందాలలో గెలుపొందేవారికి సామాన్యంగా ఏ లోటూ లేకుండా కాలక్షేపం అవుతూంటుంది. ఒలింపియా ఉత్సవాలలో విజేతలు మీ కందరికీ ఆనందాభాసం మాత్రమే కలిగిస్తారు. నేను మీ కందరికీ యథార్థానందమే అంది స్తున్నాను. న్యాయంగా నాకు విధించవలసిన శిక్ష విధించా లంటే- గౌరవ జీవనభృతి ఏర్పాటు చెయ్యడమే సరియైన పద్ధతి.

న్యాయాధిపతులను బతిమాలుకోవడం తగని పని అని నేనింతకు పూర్వం అన్నప్పటిలాగే-ఇప్పుడుకూడా దుస్సాహ సంతో ప్రసంగిస్తున్నానని మీ రందరూ భావించవచ్చును. కాని అది సరికాదు. నే నెవరికీ చెయ్యాలని అపకారా లేవీ చెయ్యలేదనే ప్రగాఢ విశ్వాసంవల్ల ఇంత ధైర్యంగా మాట్లాడు తున్నాను. ఈ విషయం మీచేత ఒప్పించలేకపోవచ్చును. కాని ఉన్న యథార్థం ఇది. అదీగాక, నాకున్న అవకాశం చాలా తక్కువ. మిగిలిన నగరాలలో మరణశిక్ష వ్యవహారం ఒక్కరోజులోనే పరిష్కరించకూడదనే నియమం ఒకటి ఉన్నది. ఏథెన్సు లో కూడా అలాంటి నియమమే ఉంటే, తప్పకుండా మిమ్మల్ని అందరినీ ఒప్పించి ఉండేవాణ్ణి. పెద్దపెద్ద నింద లెన్నెన్నో నామీద మోపారు. అవన్నీ ఇంత స్వల్పకాలంలో అసత్యాలని రుజువుపరచి మీకు నమ్మక కలిగించడం చాలా

కష్టం. నేనెప్పుడూ ఎవ్వరికీ అపకారం చేసి ఉండలేదు. కనుక నే నా వ్యవహారంలో కూడా అపకారానికి అంగీకరించలేను. నాకేదయినా శిక్ష విధించాలనీ, దానికి నేనర్హుడననీ అనుకోవడం లేదు, అందువల్ల నాకే విధమయిన శిక్షా ప్రతిపాదించుకోవడం లేదు. అసలా విధంగా నేనెందు కాలోచించాలి? మెలిటస్ నాకు మరణశిక్ష ప్రతిపాదించినంత మాత్రాన భయపడిపోయి ఏదో విధంగా ఇంకొక శిక్ష విధించడం సముచితమని నే నెందుకనాలి? అసలా మృత్యువు మేలో, కీడో కూడా నాకు తెలియకుండగా — ఆ హానికరములలో నిశ్చయంగా కీడు తెచ్చేది అయిన శిక్ష విధించమని నేనెందుకు ప్రతిపాదించుకోవాలి? ఇక ఖైదులో పెట్టవలసిందని ప్రతిపాదించనా? ఆ విధంగా ఖైదులో పడి నిరంతరం మారుతూ ఉండే న్యాయాధికారులకు నేనెందుకు దాస్యం చెయ్యాలి? లేకపోతే, జరిమానా విధించవలసిందనీ, అది చెల్లించేంతవరకూ ఖైదు శిక్ష విధించవలసిన దనీ ప్రతిపాదన చెయ్యాలా? దానికి కూడా ఇప్పుడు పేర్కొన్న అభ్యంతరాలే ఉన్నాయి. ఆ శిక్ష ప్రతిపాదిస్తే ఆ మరణాంతము ఖైదులోనే నా కాలం అంతా గడపాలి. జరిమానా చెల్లించడానికి నా దగ్గర ఒక్క చిల్లి గవ్వ లేదు. అది చెల్లించడం మరి జరిగే పనికాదు. పోనీ, ప్రవాస శిక్ష సంగతి ఆలోచిద్దాం. ఇదే శిక్ష విధించాలని మీకు కూడా అనిపించి ఉండవచ్చును. సరే! దీని సంగతి కొంచెం ఆలోచిద్దాము. మనమంతా ఒక్క నగరవు పౌరులం. ఇటువంటి మీరే నా ప్రసంగాలు భరించలేకపోతున్నారు. మీ కంటికి ఇవి ఎంతో కంటకంగా ఉన్నాయి. ఇక ఈ ఘోష మా కక్కర లేదని అంటు

న్నారు. ఈ పరిస్థితిలో పరదేశీయులు వీటిని భరించగలరని భావిస్తే- జీవితంమీది మమకారంచేత నాకీ చిన్న విషయం కూడా తెలుసుకోగల శక్తే నశించిన దన్నమాట! ఏథెన్స్ వాసులారా! పరదేశీయులు నా ప్రసంగాలు విని హర్షించటం బహుశః అసంభవమనే అనుకుంటున్నాను. ప్రవాసంలో ఉంటే, ఒకచోట నించి ఇంకొకచోటికి నన్ను తరిమివేస్తారు. ఇందులో సందేహమేమీ లేదు. ఈ పెద్ద వయస్సులో ఆవిధంగా నేనెన్నో బాధలు పడాలి. ఎక్కడికి వెళ్ళినా యువకులు నా చుట్టూ మూగుతారు. ఇక్కడ జరిగినట్టే అక్కడ జరుగుతుంది. ఇది తప్పదు. నేనా యువకులను నా దరిమానానికి రావద్దని తిరస్కరిస్తే, వారి పెద్దలా యువకుల మాటమీద నన్నింకొక చోటికి తరుముతారు. ఒకవేళ ఆ యువకులను దగ్గరకు చేరనిస్తే, వారి పెద్దలు నన్ను దూర దూరంగా తరిమివేస్తారు.

"విదేశాలకు పోయి నోరు మెదపకుండా మాట్లాడకూరుకుంటే ఎవ్వరూ నీ జోలికి రారు. ఈ ఉపదేశాలన్నీ కట్టిపెట్టి నీవా విధంగా ఉండకూడదా?" అని మీలో ఎవరయినా ప్రశ్నించవచ్చును. దీనికి నేనొక సమాధానం ఇస్తాను. కాని, మీకది అవగాహన అయ్యేటట్టు చెయ్యడం చాలా కష్టం. "మీరు చెప్పినట్టు చేస్తే అది పరమేశ్వరాజ్ఞ ఉల్లంఘించటమే అవుతుంది. అందుచేత, నేను నోరు మెదపకుండా మాట్లాడక ఊరుకోలేను" అని సమాధానం చెబితే, మీకిది నిజాయితీతో చెప్పిన ప్రత్యుత్తరమని నమ్మకం కలగదు. సద్గుణాలను గురించీ, సదుపదేశాలను గురించీ నేను వేసే అడ్డుప్రశ్నలు, చేసే పరీక్షలు, మానవాళికెంతో మంచివనీ, వివేచనా రహిత

మయిన జీవితం వృథా అనీ నేను మళ్ళీమళ్ళీ అంటే మీరిది నమ్మగలరని తోచదు. మిమ్మల్ని ఒప్పించలేకపోయినా నేను చెప్పేదంతా యథార్థమే. అదీగాక, నాకు హాని జరగవలసినంత తప్పిదం నే నేమీ చేశానని అనుకోవడం లేదు. ఇలా ఆలోచించడమే అలవాటులేదు. నాకే గనక డబ్బుంటే శక్త్యనుసారంగా శిక్షకు తగినదేదో నిర్ణయించి, అది చెల్లించి ఆట్టే ఇబ్బంది లేకుండా బయటపడి ఉందును. అయితే, నాదగ్గర డబ్బులేదు. కనక నాకు తగినట్టుగా ఇచ్చుకోవలసిన జరిమానా ఏదో నిర్ణయించమంటున్నాను. బహుశః నేనొక 'మినా' నాణెం చెల్లించగలనని అనుకుంటున్నాను. అదే నేను చేసే ప్రతిపాదన. ఇక్కడ ఉన్న ప్లేటో, క్రిటో, క్రిటోబ్యులస్, అపొలోడోరస్ మొదలయిన నా మిత్రులు 30 'మినా' నాణాలు చెల్లించవలసినదని సలహా ఇస్తున్నారు. వారంతా ఆ ధనం చెల్లిస్తామని పూచీ పడుతున్నారు. పోనీయండి! వారన్నట్లు 30 మినాలే జరిమానా అనండి. వారంతా తప్పకుండా ఆ మొత్తానికి పూచీ పడతామని అంటున్నారు కనక బాధలేదు.

*　*　*　*　*

ఏథెన్స్ నగరవాసులారా! మన నగరాని కప్రతిష్ఠ తెచ్చే వారివల్ల నిందలు పొందడాని కిక మీ కట్టే కాలం పట్టదు. వేత్త, విజ్ఞాని అయిన సోక్రటీసును మీరంతా కలిసి చంపివేశారని వారింక మిమ్మల్ని దుయ్యబట్టడం మొదలు పెడతారు. నేనొక వేత్తను, విజ్ఞానిని కాకపోయినా మిమ్మల్ని దుమ్మెత్తి పోయడం కోసం వారంతా కలిసి నేనొక విజ్ఞానినని అంటారు. నేనిప్పుడు బాగా పెద్దవాణ్ణయ్యాను. కాటికి కాళ్లు చాచుకొని కూర్చున్నాను. మీరిది స్పష్టంగా గ్రహించే ఉంటారు. ఇంక కొంతకాలం కొంచెం ఓపికపట్టి ఉంటే మీ కోరిక సహజంగా, దానంతట అదే, నెరవేరి ఉండేది. నాకు మరణశిక్ష విధించిన వారిని మాత్రమే ఉద్దేశించి నేనీ ప్రసంగం చేస్తున్నాను. అంతేగాని, అందరినీ ఉద్దేశించి చేసే ప్రసంగం కాదిది. ఈ విధంగా మరణశిక్ష విధించినవారి కింకొక సంగతి చెబుతున్నాను. విడుదల పొందడానికి తగినట్టుగా నేను మాట్లాడలేదనీ, కనకనే నాకీ శిక్ష పడిందనీ మీరనుకుంటు న్నారు. చెప్పవలసినవన్నీ చెప్పి, చెయ్యమన్నవన్నీ చేసిఉంటే, నా విడుదల జరిగి ఉండేదని మీరందరూ అభిప్రాయపడు తున్నారు. అది సరికాదు. శిక్షపడీ పడడంతోనే చాలామంది గోలుగోలున విలపిస్తూ మిమ్మల్ని కాళ్ళా వేళ్ళా పడి బతిమాలు కొనేవారు. ఇలాంటివి మీకు బాగా అలవాటయాయి. ఆ విధంగా ప్రవర్తించే ధైర్యం గాని, వెనక ముందు లాలో చించుకోకుండా ఏదిపడితే అది చేసే ధోరణి గాని నాలో లేదు. అటువంటి దైన్యపద్ధతి నా గౌరవానికి సముచితంకాదు. పెద్ద ఆపత్తులో ఉన్నంత మాత్రాన సామాన్యంగా అందరూ చేసే

పనులుగాని, నీచపు పనులుగాని చెయ్యకూడదని నేను మొట్టమొదటే నిశ్చయించుకొన్నాను. ఆత్మరక్షణ కోసం నేనొక విధంగా ప్రసంగించాను. ఆ ధోరణికి నేనిప్పు డెంతమాత్రమూ పశ్చాత్తాప పడడంలేదు. మీరనుకొన్న విధంగా మాట్లాడి బతికి బయటపడడం కన్న, నా కలవాటయిన పద్ధతిలో ప్రసంగించి మరణించడమే మంచిదని అనుకున్నాను యుద్ధరంగంలోగాని, న్యాయస్థానంలోగాని, నేనుగాని, మరి ఒక వ్యక్తిగాని, బతికి బయట పడడానికి వీలుగా ఏదిపడితే అది చెయ్యడం మంచిదికాదు. యుద్ధరంగంలో అస్త్రసన్యాసంచేసి, దీనంగా మోకరిల్లి శత్రువులను బతిమాలుకుంటూ, సాష్టాంగంగా ప్రాణాలతో బతికి బయట పడవచ్చును. ఇతర ప్రమాదాపాయ పరిస్థితులలో కూడా బతికి బయటపడడానికి కెన్నో మార్గాలున్నాయి. అయితే, ఏదిపడితే అది చెయ్యడానికి మాత్రం సిద్ధంగా ఉండాలి. మృత్యువును తప్పించుకోవచ్చును గాని, అన్యాయ ప్రవర్తనకు లొంగిపోకుండా తప్పించుకోవడం మాత్రం చాలా కష్టం. మృత్యువు మందగమనంతో సాగిపోతూంటుంది. అసత్ప్రవర్తన తీవ్రవేగంతో పరుగెత్తుతూంటుంది. నాకు వయస్సు చెల్లిపోయింది. కనక మందకొడిగా సాగిపోతాను. మందంగా సాగిపోయే మృత్యుదేవత నన్నిప్పుడు చేజిక్కించుకొన్నది. నాపై దోషారోపణ చేసినవారు చాలా తొందర మనుష్యులు. ఎంతో చురుకైన వారు. శీఘ్రగమనంతో సాగిపోయే అన్యాయ ప్రవర్తన వారందరినీ చేజిక్కించుకొన్నది. నాకిప్పుడు మరణ శిక్ష విధించారు వారు. ఆ శిక్ష అనుభవించడానికై నేనిక్కడనించి కదలి వెళ్ళిపోతున్నాను. తాము చేసిన

అన్యాయానికీ, దుర్మార్గానికీ తగిన ప్రతిఫలం పొందడానికై ఆ శిక్ష విధించినవారంతా మరొక దారిపట్టి పోతున్నారు. నా ప్రతిఫలం కోసం నేను నిరీక్షిస్తాను. వారికి లభించినది వారికి లభిస్తుంది. విధి విధానం ఈ విధంగా ఉన్నదనీ, ఇది సముచితమైనదే అనీ భావిస్తున్నాను.

నన్ను శిక్షించిన వారిని గురించి ఇప్పుడొక జోస్యం చెప్పాలని అనుకుంటున్నాను. నేనింక మరణించబోతున్నాను. మరణించబోయే వారికి భవిష్యత్తును గురించి ప్రవచించే శక్తి కలుగుతుంది. నన్ను హత్యచేసిన వారందరికీ ఈ విధంగా భవిష్యత్ప్రవచనం చేస్తున్నాను. నేను నిష్క్రమించిన వెనువెంటనే నాకు విధించిన శిక్షకంటె వేయి రెట్లు ఎక్కువ భయంకరమయిన పరిణామం వారికి కలిగి తీరుతుంది! నా ఆరోపణలనించి తప్పించుకుందామని సంకల్పించి మీరు నన్నిప్పుడు చంపివేస్తున్నారు, ఆ విధంగా మీ మీ దుశ్చేష్టలన్నీ కప్పి పుచ్చుకోవచ్చునని భావించారు. కాని మీరనుకున్నట్లు జరగదు. కేవలం దానికి వ్యతిరేకంగానే జరుగుతుంది. ఇప్పుడు మిమ్మల్ని దోషులనే వారికంటె ఎన్నో రెట్లెక్కువమందే బయలుదేరతారు. పూర్వం కన్న ఇంకా ఎక్కువగా దూషిస్తారు. ఇంతవరకూ వారు తొందరపడకుండా నేనే అడ్డుకున్నాను. వారంతా వయస్సులో కొంచెం చిన్నవారు. అందుచేత మీ మీద ఇంకా తీవ్రంగా విరుచుకు పడతారు. మీ ఆగ్రహం యింకా ఎక్కువై పోతుంది. నన్ను చంపివేసినంత మాత్రాన మీ మీ మలిన జీవితాలను విమర్శించి ఖండించే వారింకెవరూ ఉండరని అనుకుంటున్నారు కాబోలు! మీరు

చాలా పొరబడుతున్నారు. ఆ విధంగా తప్పించుకొని పారి పోవడం సాధ్యమూ కాదు, గౌరవప్రదమూ కాదు. దీని కతి సులభమయిన, ఉదాత్తమయిన పద్ధతి ఒక్కటే. ఇతరుల కపకారం చెయ్యడంమాని- మిమ్మల్ని మీరు సంస్కరించు కోవడం. అదే సరిఅయిన మార్గం. నా నిష్క్రమణానికి పూర్వం శిక్ష విధించిన న్యాయమూర్తులకు నా భవిష్యద్వాణి ఇదే!

మిత్రులారా! మీలో కొందరు నన్ను విడిపించాలని అనుకున్నారు. ఈ సంఘటనను గురించి మీతో కూడా నాలుగు మాటలు చెప్పాలని అనుకుంటున్నాను. న్యాయాధి పతు లేవో పనులలో మునిగి ఉన్నారు. శిక్ష అమలుజరిగే ప్రదేశానికి నేను వెళ్ళాలి. కనక ముందుగానే చెప్పదలచు కున్న వేవో చెబుతాను. ఈ కొంచెం వ్యవధి ఉన్నప్పుడే- కొంచెం సేపు ఇష్టాగోష్ఠితో కాలక్షేపం చేదాము.

న్యాయాధిపతులారా!- మిమ్మల్ని నిజానికి ఇలాగే సంబో ధించాలి- ఒక విచిత్ర సంఘటన జరిగిందిప్పుడు. అది మీకు వివరిస్తున్నాను. నా లోలోపల ఒక దివ్యవాణి పదేపదే హెచ్చరిక చేస్తూ ఉంటుందని అన్నాను. చిన్నచిన్న విషయా లను గురించి కూడా చేయవద్దని హెచ్చరికలు వినిపిస్తూం టాయి. ఏస్వల్ప విషయంలో నయినా నేను పొరబడుతూంటే, వెంటనే అది సరి కాదని ప్రబోధం వినబడుతూంటుంది. ఇప్పుడు నామీద ఒక పెను ప్రళయం విరుచుకు పడింది. ఇంత కంటే చెడుగిక ఏమీ లేదని సామాన్యంగా అందరూ అను కుంటారు. అలాగ అనుకోవడం సముచితమే. ఉదయం ఇంటి

దగ్గరనుంచి బయలుదేరినప్పుడు గాని, న్యాయస్థానానికి బయలు దేరి వచ్చే మార్గంలో గాని, ప్రసంగిస్తున్నప్పుడు గాని, ఆదివ్య వాణి ఇది మంచి మార్గం కాదని నన్నే విధంగానూ ప్రబోధించ లేదు. సామాన్యంగా నే నేదయినా ప్రసంగిస్తూ ఉంటే, అది సముచితం కాదని మధ్యలో నన్నాపివేసే దా అశరీరవాణి. కాని ఈనాడు నా ప్రసంగ సమయంలో అటువంటి సంఘటన ఏదీ జరగలేదు. ఈ మౌనం నే నేవిధంగా అర్థం చేసుకున్నానో మీకు తెలియజేస్తున్నాను. ఇప్పుడు నాకు విధించిన శిక్ష మొదలయినవన్నీ మంచివే అని అశరీరవాణి మౌనం ద్వారా సూచిస్తున్నదని అనుకుంటున్నాను. మృత్యువేదో మహాపద అని భావించే వారంతా పొరబడుతున్నారని కూడా ఈ మౌనం స్ఫురింప జేస్తున్నది. నాకు చెడుగే జరిగి, మంచి జరగని పక్షంలో హృదయాంతర దివ్యవాణి తప్పక నాకొక హెచ్చరిక చేసి ఉండేది.

మరణం సంగతి మరి ఒక విధంగా ఆలోచిద్దాము. మృత్యువు చాలా మంచిదనడానికి చాలా గొప్ప కారణా లున్నాయి. దానిని గురించి రెండు విధాలయిన అభిప్రాయా లున్నాయి. అది కేవలం శూన్య స్వరూపమనీ, ఆ స్థితిలో చైతన్యం ఏమీ ఉండదనీ కొంద రంటారు. మరణానంతరం ఆత్మ ఈ లోకంలో నుంచి ఇంకొక లోకానికి వెళ్ళుతున్నదనీ, మరణం అంటే మార్పేననీ మరి కొంద రంటారు. అది చైత న్యము, స్వప్నాలు ఏవీ లేని ప్రశాంత సుషుప్తే అయితే, మృతి వల్ల చాలా గొప్ప లాభమే కలుగుతున్న దన్నమాట. ఒక

వ్యక్తి ఒక నాటి రాత్రి స్వప్నాలు మొదలైన వేవీ లేని ప్రశాంతి సుషుప్తి చెంది చూచాడని అనుకుందాము. మిగిలిన రాత్రులలో పరిశీలించి చూసినప్పుడు కలలు మొదలైనవి రాని రాత్రి చాలా గొప్పదని అనిపిస్తుంది. ఒక సామాన్య వ్యక్తే కాదు, మహారాజు కూడా అదే ప్రశాంతమయిన నిశీథమని అనుకుంటాము. మృత్యువు అలాంటి ప్రశాంత రాత్రే అయితే, అది చాలా గొప్ప లాభమే అనీ, ఆనంద దాయకమే అనీ అనాలి. అనంత తన్వాయుంటే ఒకటి రాత్రే. ఒక వేళ మరణానంతరం పరలోకానికి వెళ్ళి, చనిపోయిన వారి నందరినీ తిరిగి అక్కడ కలుసుకుంటే, దానికంటే గొప్పదేమైనా ఉన్నదా? అటువంటి వ్యక్తి పాతాళ లోకంలో ప్రవేశించగానే, అతనికి ఈ లోకంలో న్యాయాధిపతుల పీడ వదిలిపోతుంది. పాతాళలోకంలో ఉన్న నిజమైన న్యాయాధిపతుల దగ్గరికి వెళ్ళిపోతాడు. * మినోస్, రాడమాంథస్, ఏకస్, ట్రిప్టోలిమస్ మొదలయిన పాతాళ న్యాయమూర్తులీశ్వరుని కుమారులు. తాము జీవించి ఉన్నప్పుడు చాలా సత్పురుషులని పేరు పొందారు. అందుచేత ఆ లోకయాత్ర ఎంతో మంచి దన్న మాట. ఆర్ఫియస్, హెసియోడ్, హోమర్ మొదలయిన మహాకవులతో ప్రసంగించాలని ఎలాంటివారైనా తహతహ పడతారు. నిజంగా ఆ లోకంలో అటువంటి మహదవకాశమే లభిస్తే నేను మాటిమాటికీ మరణించాలని ఆశిస్తాను. అదీగాక

* మినోస్, రాడమాంథస్, ఏకస్, ట్రిప్టోలిమస్; వీరంతా జెన్సుకి మర్త్య కుమారులు. వీరిని పాతాళ లోకంలో న్యాయమూర్తులుగా నియమించారు

పాలమీడిస్‌నీ తోటి, టెలమన్ కుమారుడు అజాక్సుతోను, ఇంకా అన్యాయంగా శిక్ష అనుభవించిన ప్రాచీన వీరవరేణ్యుల తోను అక్కడ ప్రసంగించాలని ఉన్నది. నా కష్టాలు వారనుభ వించిన కష్టాలతో సరిపోల్చి చూసుకుంటే ఎంతయినా సంతోషం కలుగుతుంది. అదీగాక ఇక్కడ సాగించినట్లే అక్కడకూడా ఎడతెగకుండా నా సత్యాన్వేషణ కొనసాగించ వచ్చును. అక్కడ ఉన్నవారిలో బుద్ధిమంతులెవరో, బుద్ధిమంతులమని నటించే అజ్ఞానులెవరో పరిశీలిస్తాను. ట్రోజన్ యుద్ధ నాయకుడు * ఒడిస్సియస్, సిసిఫస్ మొదలాయిన వారితోను ఇంకా అనేకులు స్త్రీ పురుషులతోను కలిసిమెలిసి ఉండి వారిని పరీక్షించడంకన్న, ఇష్టాగోష్ఠి ప్రసంగాలారంభించడం కన్న కావలసినదేమి ఉన్నది, అదీగాక! వారినెన్నో ప్రశ్నలడిగి ఎన్నెన్నో విషయాలు తెలుసుకోవచ్చును. పైగా, ప్రశ్న లడిగినందుకు ఆ లోకంలో మరణశిక్ష విధించరు. ఇందులో అనుమానమేమీ లేదు. పాతాళలోకవాసులు మనకన్న ఎంతో ఆనందంగా కాలం గడుపుతారు. పైగా వారమరు లట కూడా.

♦ పాలమీడిస్, అజాక్సు: ట్రాయ్ యుద్ధ ప్రధానుల ద్వారా లంచాలు తీసుకుని పాలమీడిస్ తన స్వదేశీయులైన గ్రీకులను మోసగించాడని అన్యాయంగా ఆరోపణ చేశారు. అకిలస్ మరణించిన తరువాత అతని ఆయుధాలు న్యాయంగా అజాక్సు కివ్వాలి. కాని ఆయుధాలతనికి అందలేదు. దాంతో అతనికి మతిపోయింది. కొంతకాలానికి ఆత్మహత్య చేసుకొన్నాడు. ఆయుధాలన్యాయంగా ఒడిస్సియస్‌కు సంక్రమించాయి.

* ఒడిస్సియస్, సిసిఫస్ :- వీరిద్దరు ఒకరిని మోసగించడంలో ఒకరు చాలా గట్టివారు.

న్యాయాధిపతులారా! మృత్యువంటే కులాసాగా, ఎంతో సంతోషంగా ఉండవలసినదని కోరుతున్నాను. సజ్జనుల కీ లోకంలోగాని, పరలోకంలోగాని ఏవిధమైన చెడుగు జరగదని గుర్తుంచుకోండి! దేవత లటువంటి సత్పురుషులను, వారి కుటుంబాలను సదా సంరక్షిస్తూనే ఉంటారు. అదీగాక, ఇదంతా ఊరికే యథాలాపంగా జరిగినదని నే ననుకోవడం లేదు. ఇప్పుడు మరణించి, ఈ విధంగా కష్టాలన్నీ గడిచి గట్టెక్కడమే మంచిదని భావిస్తున్నాను. కనకనే దివ్యవాణి నా కే విధంగాను హెచ్చరిక చెయ్యలేదు. ఇందువల్లనే దోషారోపణలు చేసిన వారంటే నాకేమీ కోపం లేదు. వారు నాకు చేసిన మంచి ఏమీ లేదు. కాని, వారు నా కే విధంగానూ అపకారం కూడా చెయ్యలేదు. మంచి చెయ్యనందుకు వారిని కొంచెం మందలిస్తున్నాను. అంతే!

అయినా వారి నొక విషయం అర్థిస్తున్నాను. నా కుమారులు పెరిగి పెద్దవారై, సద్గుణాలను అలక్ష్యం చేసి, ఐశ్వర్యం మీదే ఎక్కువగా ఆసక్తి చూపిస్తే, వారిని శిక్షించవలసినదని కోరుతున్నాను. ఇంతేకాదు. నా కుమారు లేమీ తెలియని అజ్ఞులయినా, తమకే సర్వము తెలుసునని నటించవచ్చును. నిజంగా కోరవలసిందేదో కోరకుండా, అనవసరమైన వాటికోసం అర్రులు చాచవచ్చును. అలాంటి పరిస్థితిలో నా ధోరణిలోనే వారిని గట్టిగా మందలించండి! మీ రిది చేస్తే నాకు, నా కుమారులకు మీవల్ల న్యాయం లభించినదన్నమాటే,

స్నేహితులారా! నిష్క్రమణ సమయం సమీపించింది. మన దారులు వేరవుతున్నాయి. నేను మరణించడానికి బయలు దేర బోతున్నాను. మీరు జీవించాలని వెడుతున్నారు. ఈ రెంటిలోను మంచి దేదో ఆ పరమేశ్వరునికే ఎరుక!

సోక్రటీస్‌కు విషం పుచ్చుకుని మరణించమని శిక్ష విధించారు. ఆ శిక్ష అమలు జరపటానికి కొద్దిరోజుల వ్యవధివుంది. ఆ సమయంలో సోక్రటీసు స్నేహితులు — అతనిని జైలునుంచి తప్పించడానికి ప్రయత్నం చేస్తారు. క్రిటో సోక్రటీసుకు ఆప్త మిత్రుడు. అతడు జైలులో సోక్రటీసును కలుసుకొని పారిపోడానికి పథకం సిద్ధంగా వుందనీ, వెంటనే పారిపొమ్మనీ — చెప్తాడు. అప్పుడు క్రిటోకీ, సోక్రటీసుకూ జరిగిన సంభాషణ యిది.

ధర్మస్థాపనమే ఆశయంగా జీవించదలచుకొన్న సోక్రటీసు — తన ఆశయం కోసం ప్రాణంమీది మమకారాన్ని సయితం త్యజించగలిగాడని ప్లేటో రచించిన యీ సంభాషణ వల్ల యింకొకసారి రుజువు అవుతుంది.

సోక్రటీస్‌కు — న్యాయమూర్తులు నిజంగా న్యాయ్యమైన నిర్ణయం చెయ్యలేదని తెలుసును. కాని, అంతమాత్రంచేత చట్టబద్ధమైన ఆ నిర్ణయాన్ని ఉల్లంఘించడం పౌరుడి ధర్మం కాదంటాడు. న్యాయాన్ని సాధించడానికి మార్గాలుకూడా న్యాయంగానే ఉండాలని ఆయన సిద్ధాంతం.

ప్రాధేయపడి తన ప్రాణాన్ని నిలబెట్టుకునే అవకాశాన్ని న్యాయస్థానంలో కాలదన్ని, పారిపోవడానికి తన ఆప్తులు చూపించిన అవకాశాన్ని కూడా తానై వదులుకుని, స్వేచ్ఛగా విషపాత్రను పెదవుల కందించుకుంటాడు సోక్రటీస్.

# క్రిటో

ప్రసంగంలో పాల్గొన్నవారు

సోక్రటీస్, క్రిటో

ప్రదేశం

సోక్రటీస్ కారాగారం

---

సోక్రటీస్ ప్రసంగిస్తున్నాడు

సోక్రటీస్ : ఈ వేళ ఇలాగ చాలా ముందుగానే వచ్చేశావేం క్రిటో ?

క్రిటో : అవును; ముందుగానే వచ్చాను.

సో : ఇప్పుడు ఎంతయింది ?

క్రి : తెల్లవారుతూంది.

సో : జైలు కాపలా మనిషి నిన్నెలాగ రానిచ్చాడా అని నా ఆశ్చర్యం !

క్రి : అతను నన్నెరుగును. లోగడ అతనికి నేనొక చిన్న ఉపకారం కూడా చేశాను.

సో : అయితే నీవు ఇప్పుడే వచ్చావన్నమాట !

క్రి : కాదు. కొంచెం ముందుగానే వచ్చాను.

సో : మరి రాగానే నన్ను లేపకుండా అలాగ మాట్లాడకుండా కూర్చుండిపోయావేం ?

క్రి : సోక్రటీస్ ! నీవు ఎంత మహా విపత్తులో చిక్కుకొని ఉన్నావు! అందుచేత, నీకు నిద్రాభంగం చేయడానికి నాకు మనస్కరించలేదు. హాయిగా, ప్రశాంతంగా నిద్రపోతూంటే, నేను విస్తుపోయి, నీ వైపలాగే చూస్తూ కూర్చున్నాను. నీ వేదన సాధ్యమైనంతవరకు తగ్గించాలని అనుకున్నాను. అందుచేత లేపలేదు. నీవు నిత్య సంతోషివని నేనెరుగుదును. అయితే ఇలాంటి మహాపద ఇంత ప్రశాంతంగా,

ఇంత తేలికగా భావించడం నేనింతకు పూర్వం ఎన్నడూ చూడలేదు !

సో : క్రిటో ! నా వయస్సులో ఉన్న వ్యక్తి రాబోయే మృత్యువును గురించి కంగారు పడకూడదు.

క్రి : కాని, ఇంతటి వార్ధక్యంలో ఇలాంటి ఆపదలో చిక్కుకున్న వ్యక్తులు కంగారు పడకుండా ఉండడంలేదు !

సో : అది నిజమేగాని, ఇంత ముందుగా నీ విక్కడికి ఎందుకు వచ్చినదీ చెప్పావుకాదు.

క్రి : నీకీవేళ ఒక దుఃఖ వార్త అందజెయ్యడానికి వచ్చాను. నీ కిది బాధకలిగించదనే అనుకుంటాను. కాని నీ మిత్రు లందరికీ ఇది ఎంతో వేదన కలిగించే వార్త. నన్నిది మరింత కలిచివేసింది.

సో : ఆఁ! ♦డెలోస్‌నుంచి ఆఓడ అప్పుడే వచ్చేసిందా? దానితో నే నా మృత్యువు.

క్రి : ఆ ఓడ ఇక్కడికింకా రాలేదు. బహుశః అది ఈవేళ వస్తుందనుకుంటాను. * సూనియానించి ఇక్కడికి వచ్చిన వాళ్ళు ఆ ఓడ అక్కడ చూచి వచ్చామని చెప్పారు. అందుచేత రేపే నీ జీవితానికి అంతిమ దివసం అవుతుంది.

♦ డెలోస్ మహోత్సవ సందర్భంలో ప్రతి సంవత్సరం ఏథెన్స్ నించి డెలోస్ కొక నౌక పంపించేవారు. అది చాలా పవిత్రమయింది. ఆ నౌక తిరిగి వచ్చేదాకా ఉత్సవ పవిత్రతకు భంగం కలిగించే మరణ శిక్షలసలు విధించేవారు కారు.

* సూనియమ్ : గ్రీసుకు దక్షిణంగా ఉన్న ఒక భూభాగం.

సో : సరే! బాగుంది. పరమేశ్వర విలాసం ఎలాగ ఉన్నదో, అలా జరుగుతూంది. కాని, ఇంకా ఒకరోజు ఆలస్యం అవుతుందని నా నమ్మకం.

క్రి : ఎందుచేత ?

సో : చెబుతాన్నాను విను. అ ఓడ వచ్చిన నాడే నా మృత్యువుగదా !

క్రి : అవును. అధికారులలాగే అంటున్నారు.

సో : కాని, ఆ ఓడ రేపటిదాకా ఇక్కడికి రాదని అనుకుంటున్నాను. నీవు నన్ను సుఖంగా నిద్రపోనిచ్చిన సమయంలో ఇప్పుడిప్పుడే నాకొక కల వచ్చింది. దానిని బట్టే నేనిలాగ ఊహిస్తున్నాను.

క్రి : ఏమిటా కల ?

సో : ఆ కలలో నాకొక స్త్రీ మూర్తి ప్రత్యక్షమయింది. ఆ మూర్తి స్వచ్ఛమయిన దుస్తులతో మెరిసిపోతూ ఎంతో సొగసుగా, సౌమ్యంగా కనిపించింది. నన్ను పిలిచి ఇలాగన్నది :

"నేటికి మూడవ నాటికి
పంటలతో కిలకిలలాడే
ఫిథియా కీ వేగెదవోయీ !"

క్రి : ఎంత విచిత్రమయిన కల !

సో : ఈ కల అర్థం విషయంలో సందేహ మేమీ లేదనుకుంటున్నాను.

క్రి : అవును. అర్థం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. సోక్రటీస్ ! మళ్లీ నిన్నొకసారి మనసారా ప్రార్థిస్తున్నాను. నా మాట విను! తప్పించుకుని పారిపో. నీవు చనిపోతే నీ వంటి మిత్రుడు నాకు మరి కనబడడు! అంతే కాదు. ఇంకొక అపదకూడా వస్తుంది. నేను ధనం ఇచ్చి ఉంటే నిన్ను రక్షింపగలిగి ఉండేవాణ్ణనీ, కాని నేనిది పట్టించుకోలేదనీ, నిన్నూ నన్నూ ఎరుగని వాళ్ళంతా అనుకుంటారు. మిత్రుని జీవితంకన్న నాకు ధనమే ప్రాణమని భావిస్తారు. అంతకంటె అధమమయిన అవమానం నాకు వేరేలేదు. నేను నిన్ను పారిపొమ్మన్నాననీ, దీనికి నీ వంగీకరించలేదనీ వారు నమ్మరు.

సో : మన మా బహు సంఖ్యాకుల అభిప్రాయాలు లక్ష్యపెట్టవలసిన అవసరమేమున్నది. క్రిటో ! ఈ సందర్భంలో సత్పురుషుల అభిప్రాయాలే గమనించాలి. వారీ విషయాలన్ని ఉన్నవి ఉన్నట్టే గ్రహిస్తారు.

క్రి : కాని సోక్రటీస్! బహు సంఖ్యాకుల అభిప్రాయాలు కూడా జాగ్రత్తగా గమనించాలి. వారి సదభిప్రాయం పోగొట్టుకున్న ఏ వ్యక్తికైనా వారి వల్ల మహా విపత్తు సంభవిస్తుందని ప్రస్తుత సంఘటనలు రుజువు చేస్తున్నాయి.

సో : నీ వన్నది నిజం అయితే బాగుండును. బహు సంఖ్యాకులెంతో గొప్పగా చెడుగు చెయ్యగలిగితేకూడా బాగానే ఉండును. అలా గయితే వారెంతో గొప్పగా మంచికూడా చెయ్యగలరన్న మాటే! నిజంగా అలాగే గనక జరిగితే అది ఎంత గొప్పమాట ! వాస్తవానికి బహు సంఖ్యా

కలు సత్కార్యంగాని, దుష్కార్యంగాని గొప్పగా చెయ్యలేరు. వారే వ్యక్తినీ విజ్ఞుడుగా గాని, అజ్ఞుడుగా గాని మార్చలేరు. వారేది చేసినా అది అదృష్టఫలితమే.

క్రి : ఈ విషయంలో నీవన్నది కాదనను. అయితే ఒక్క విషయం అడుగుతున్నాను. దయచేసి దీనికి సమాధానం చెప్పు. నా మీద, ఇంకా ఇతర మిత్రుల మీద ఉన్న ఆప్యాయత వల్లనే నీవిలాగ ప్రవర్తిస్తున్నావు. అవునా? నీవు ఖైదులోనుంచి తప్పించుకుపోతే ఈ విషయం అధికారులకు తెలియజేసే వారివల్ల మాకిబ్బందులు కలుగుతాయని భయపడుతున్నావు! అవునా? అందువల్ల మా ఆస్తులు కొంతగాని, పూర్తిగాగాని పోగొట్టుకోవచ్చుననీ, అంతకంటే పెద్ద ఆపదలు కూడా రావచ్చునని భావిస్తున్నావు అవునా?

అయితే, మా విషయంలో నీకేమీ భయపడనక్కరలేదు. నిన్ను రక్షించటానికి మేమెంతటి గొప్ప విపత్తయినా ఎదుర్కోవాలి. అందుచేత, నా మాట విని నేను చెప్పినట్లు చెయ్యి సోక్రటీస్!

సో : అవును క్రిటో! నీవు చెప్పిన విషయంలో నేను భయపడుతున్నాను. నిజమే. కాని ఆ ఒక్క విషయాన్ని గురించే నేను భయపడుతున్నానని అనుకోకు!

క్రి : దీనికి నీవేమీ కంగారు పడనక్కరలేదు. అట్టే ఇబ్బంది పడకుండా నిన్ను ఖైదులోంచి తప్పించడానికి సిద్ధపడే వారెంతోమంది ఉన్నారు. ఇక ఈ విషయం పై అధికారులకు తెలియజేసేవారి మాట! వారికోసం అంత పెద్ద

మొత్తాలేవీ ఖర్చు చెయ్యనక్కరలేదు. కొద్ది మొత్తంతో వారిని సంతోష పెట్టవచ్చును. నాదగ్గర ఎంతో ధనం ఉన్నది. అది నీవు యథేచ్ఛగా వాడుకోవచ్చును. నా ధనం అంతా ఖర్చు చెయ్యడానికి మనస్కరించకపోతే ఇంకా ఇతరులు నీకు ధన సహాయం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు. వారిలో థేబన్ నివాసి సిమ్మియాస్ ప్రత్యేకం దీనికోసం ఎంతో ధనం తీసుకు వచ్చాడు. నీవు తప్పించుకుని పారిపోవడానికి శాయ శక్తులా సాయం చెయ్యడానికి సెబెస్ మొదలయిన వారు తమ ధనం ఖర్చు పెట్టడానికి సిద్ధంగా ఉన్నారు. నీవు దీనికోసమేమీ భయపడనక్కరలేదు. ఏథెన్సులో తప్ప మరెక్కడా నివాసం నీవేం చెయ్యాలో నీకు తెలియడం లేదని నీవు న్యాయస్థానంలో అన్నావు. ఆ మాట మరి అనవద్దు! ఏథెన్సులోనే కాక థెసాలీలో కూడా నాకు స్నేహితులున్నారు. అక్కడికి వెళ్ళదలచుకుంటే వారు నిన్నెంతో గౌరవించి సంరక్షిస్తారు. థెసాలీ వాసులెవరూ నీకే విధమయిన ఇబ్బందీ గానీయరు. ఆత్మ రక్షణకు అవకాశాలున్నప్పుడు ప్రాణత్యాగానికి సిద్ధపడడం న్యాయం కాదని భావిస్తున్నాను. అలాగ కాక ప్రస్తుతం సంకల్పించినట్లే ప్రవర్తిస్తే, నిన్ను హతమార్చి వెయ్యాలని తొందరపడుతున్న శత్రువుల చేతులలో చిక్కుకుంటున్నావు! అదీ గాక నీ పిల్లల్ని దిక్కులేని వారిని చేస్తున్నావు! నీవు జీవించి ఉంటే వారిని పెంచి పెద్దవారిని చేయవచ్చును. వారికి చదువు సంధ్యలు చెప్పి ఉండవచ్చును. దీనికి బదులుగా నీ దారిని నీవు పోయి, వారి మానాన్ని వారిని విడిచిపెడుతున్నావు! వారింక తమ గతి తాము చూచుకో

వలసిన పరిస్థితులలో పడతారు. వారికిక అనాథల గతి పట్టక పోతే కొంతవరకు అదృష్టవంతులే! పిల్లల్ని పెంచి, పెద్ద వారినిచేసి, వారికి చదువు సంధ్యలు చెప్పించాలన్నంత శ్రద్ధ లేనివారు వారి నసలు కననే కూడదు! కాని నీవీ విషయంలో సులువయిన పద్ధతి అవలంబించాలని చూస్తున్నట్టు తోస్తున్నది. అంతేగాని, ధైర్యంగా అంతకన్న మంచిపద్ధతి అవలంబించడం లేదు. సమస్త కర్తవ్యాలలోను సౌజన్యం అవలంబించే నీవంటి వాడికి నేను చెప్పినదే తగిన మార్గం. చివరకీ విషయంతా మా వంటివారు ధైర్యసాహసాలతో పనిచెయ్యక పోవడం వల్లనే వచ్చిందని అంటారేమో నని—నీ కోసమే గాక, మిత్రులకోసం కూడా నేనెంతో కించపడుతున్నాను. అసలీ విచారణే జరగకుండా ఉండేది. లేకపోతే ఇదంతా ఇంకొక విధంగా జరిగేది. ఈ చిట్టచివరి విషాద సంఘటన నిన్ను రక్షించ గలిగిన మా పిరికితనంవల్ల, మా అశ్రద్ధవల్ల జరిగినట్లు కనిపిస్తుంది. అసలు మా వల్ల ఏమైనా కొంచెం మంచి జరిగే అవకాశమే ఉంటే, నీ వీ ఆపత్తులోనుంచి తప్పించుకొని సుఖంగా బయటపడి ప్రాణాలు కాపాడుకోవచ్చును. ఇందులో చిక్కులేవీ లేవు. సోక్రటీస్! దీని పరిణామం నీకు, మాకు ఎంత విషాదకరంగా, ఎంత అపఖ్యాతికరంగా ఉంటుందో ఆలోచించు! ఏదో ఒక నిశ్చయానికి రా! కాదు ఇప్పుడే ఇది నిశ్చయించు! ఇక ఆలోచిస్తూ కూర్చోడానికి వ్యవధి లేదు. ఈ రాత్రి లోగానే మనం అనుకున్నది చేసెయ్యాలి. ఇప్పుడిక ఆలస్యం చేస్తే ఇది సాధ్యం కాదు! ప్రాధేయ పడుతున్నాను సోక్రటీస్! నా మాట విని నేను చెప్పినట్టు చెయ్యి!

సో : నాయనా! క్రిటో! సరియైన దారిలో ఉంటే నీ ఉత్సాహం అంతా అమూల్యమైనదే! ఆ దారిలో లేకపోతే ఆ ఉత్సాహం ఎంత గొప్పదయితే అంతటి ఆపద వస్తుంది. కనక నీవు చెప్పినట్లుగా నేను చెయ్యాలో చెయ్యకూడదో మనం ఆలోచించాలి. నేనెప్పుడూ హేతుబద్ధంగా నడుచుకొనే వ్యక్తిని. ఆ కారణం ఏదయినాసరే! ఆలోచించిన మీదట అది న్యాయమని తోస్తే నేనా ప్రకారమే నడుచుకొంటాను. నేనీ పరిస్థితిలో ఉన్నంతమాత్రాన ఇన్నాళ్ళనుంచీ చెప్పిన మాటలిప్పుడు కాదనలేను. ఇన్నాళ్ళనుంచీ, గౌరవించి, ఆదరించిన సిద్ధాంతాలిప్పుడు కూడా గౌరవిస్తూనే ఉన్నాను. అంతకన్న మంచి సిద్ధాంతాలేవైనా మనమిప్పుడు ఈ క్షణంలో ఆవిష్కరించగలిగితే తప్ప నేను నీతో ఏకీభవించలేను. అత్యధిక సంఖ్యాకులయిన జనసమూహం ఇంతకన్న పెద్ద కారాగార వాస శిక్ష, ఆస్తి స్వాధీనం చేసుకునే శిక్ష, మరణశిక్ష విధించి, ఇంకా భయంకరమయిన దండనలతో చిన్న పిల్లల్ని భయపెట్టినట్లు భయపెట్టినా సరే! ఇది ఇంతే.

అయితే ఈ విషయం సమంజసంగా పరిశీలించడమెలాగ? నీవు అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయాలు ఆదరించాలని వాదించావు! అది తిరిగి పరిశీలిద్దామా? కొందరి అభిప్రాయాలే గౌరవించాలనీ, మరికొందరివి గౌరవించకూడదనీ మనం అనుకొన్నాము. అయితే నాకు శిక్ష విధించడానికి పూర్వం ఈ విధంగా నిశ్చయించడం సముచితం. అవునా? కాదా? పూర్వం ఒకప్పుడు మంచిదనుకున్న వాదం ఇప్పుడు కేవలం అర్థంలేని అసంబద్ధవాదమై పోతుందా? క్రిటో! నీ

సహాయంతో నేను సమస్య ఆలోచించాలని నిశ్చయించాను. ప్రస్తుత పరిస్థితులలో ఆ వాదం మారిందో లేదో నేను పరిశీలించాలి. అసలు నేనా ధోరణి అంగీకరించాలా? తిరస్కరించాలా? ఆ వాదం మనం గౌరవించేవారందరూ ప్రతిపాదిస్తున్నారు. కొందరి అభిప్రాయాలే మనం గౌరవించాలి, మరి కొందరివి గౌరవించకూడదు, అని ప్రతిపాదిస్తున్నదా వాదం. నేను అదే ప్రతిపాదించాను క్రైటో! నీవు అధమం రేపటిదాకా జీవించి ఉంటావు. మన మానవ దృష్టితో పరిశీలిస్తే ఇది జరగదేమో అనడానికి ఆస్కారమేమీ లేదు. కనక నీ విది కొంత నిర్లిప్త దృష్టితో చూడవచ్చును. పరిస్థితులకు నీవు లోను కానక్కర లేదు. నేను కొన్ని అభిప్రాయాలే అంటే కొందరి అభిప్రాయాలే గౌరవింప దగినవి అంటున్నాను. మరి కొందరి అభిప్రాయాలు గౌరవింప దగినవి కావని అంటున్నాను. నేనన్నది సమంజసమేనా?

క్రై: నిశ్చయంగా సమంజసమే.

సో: సజ్జనులనే గౌరవించాలి. అసజ్జనులను గౌరవించ కూడదు.

క్రై: అవును.

సో: విజ్ఞుల అభిప్రాయాలే మంచివి. తదితరుల అభిప్రాయాలు మంచివి కావు అవునా?

క్రై: అవును. నీవన్నది అవశ్యం నిజమే.

సో: ఒక విద్యార్థి ఒక గురువు దగ్గర వ్యాయామ విద్య అభ్యసిస్తున్నాడు. అతడు ప్రతి వ్యక్తి నిందాస్తుతులను లెక్క-

చెయ్యాలా? ఆ వ్యక్తి ఎవరయినా, ఒక్క తన గురువు నిందాస్తుతులే లెక్క చెయ్యాలా? దీనికి నీ వేమంటావు?

క్రి : తన గురువు నిందాస్తుతులే లెక్క చెయ్యాలి.

సో : ఆ శిష్యుడా ఒక్క వ్యక్తి నిందాస్తుతులే లెక్క చెయ్యాలి. మిగిలినవారందరు ఏమన్నా వినకూడదు. అవునా?

క్రి : అవును. నిజంగా అంతే.

సో : అంతేకాక, ఆ శిష్యుడు చక్కని అవగాహన కలిగిన తన ఏకైక గురువు ఆదేశ ప్రకారం అన్నపానాదులు స్వీకరిస్తూ అతని ఆజ్ఞ ప్రకారం నడుచుకుంటూ వ్యాయామం అభ్యసించాలి. అంతేగాని, మిగిలిన వారెంతమంది ఉన్నా వారి అభిప్రాయాలు పరిగణించకూడదు. అంతేనా?

క్రి : అవును. నిజమే.

సో : అవగాహన లేని అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయాలు లెక్కచేస్తూ, తన గురువు అభిప్రాయం ఆదరించలేకపోతే అతనికి దుష్ఫలితాలు కలుగుతాయా? కలగవా?

క్రి : తప్పక దుష్ఫలితాలు కలుగుతాయి.

సో : అలాగ తన ఆచార్యుని అభిప్రాయాలు తృణీకరించిన వ్యక్తికి ఏవిధమయిన దుష్ఫలితాలు కలుగుతాయి?

క్రి : శారీరకంగా అతనికి అనేకమయిన దుష్ఫలితాలు కలుగుతాయి. వాటి మూలంగా అతని శరీరం సర్వనాశనమయిపోతుంది.

సో : సరే బాగుంది. క్రిటో ! ఇక వేరే మనం ప్రత్యే కించి చెప్పనక్కర లేకుండా, మిగిలిన ఇతర విషయాలలో కూడా ఇది యాథార్థమే కదా ? మనం ప్రస్తుతం చర్చిస్తున్న న్యాయాన్యాయాలలోను, మంచి చెడుగులలోను ఇది యథార్థమే కదా ? అయితే మనం ఈ వ్యవహారంలో కూడా విజ్ఞుడయిన ఒక వ్యక్తినే అనుసరించాలా? లేక చాలామంది అభిప్రాయం ప్రకారం నడుచుకుంటూ వారికి భయపడాలా ? ప్రపంచంలో ఉన్న అందరికన్నా ఆ ఒక్క వ్యక్తినే అనుస రించడం సముచితం కాదా? మనలో ఒక సూత్రం అంతర్గర్భి తమయి ఉన్నది. అది న్యాయంవల్ల అభివృద్ధి పొందుతున్న దనీ, అన్యాయంవల్ల క్షీణించి పోతున్నదనీ అంటారు. విజ్ఞు డయిన అటువంటి వ్యక్తిని తిరస్కరించి కాదనడం వల్ల ఆ సూత్రానికి భంగం కలిగించడం లేదా? అటువంటి సూత్రం ఒకటి మనలో ఉన్నదంటావా ? లేదంటావా ?

క్రి : సోక్రటీస్ ! తప్పకుండా మనలో అటువంటి సూత్రం ఉన్నది.

సో : దీనితో సమానమయిన ఒక ఉదాహరణ ఇస్తు న్నాను. విజ్ఞులు కానివారి అభిప్రాయం ప్రకారం నడుచు కోవడం మనం మన శరీరాలు పాడుచేసుకుంటున్నాము. ఇవి ఆరోగ్యంవల్ల బాగుపడతాయి. అనారోగ్యంవల్ల పాడయి పోతాయి. అవునా? కాదా? అలాంటి శరీరాలే పాడయి పోతే మనకి జీవితం వ్యర్థమే కాదా ?

క్రి : అవును.

సో : పూర్తిగా పాడయిపోయిన శరీరంతో మనం జీవించగలమా ?

క్రి : జీవించలేము. నిజమే.

సో : మనలో ఒక సూత్రం అంతర్గర్భితమయి ఉన్నది. అది న్యాయంతో అభివృద్ధి పొందుతున్నది. అన్యాయంతో క్షీణించి పోతున్నది. అదే మనలో ఉన్న ఉదాత్త సూత్రము. అదే నశించిపోతే ఇక జీవితంవల్ల ప్రయోజనం ఏమి ఉన్నది? న్యాయాన్యాయాలతో ముడిపడిన ఆ సూత్రం మానవ శరీరం కంటె తక్కువదని మనం అనుకొంటున్నామా ?

క్రి : లేదు. అలాగ నేను అనుకోవడంలేదు.

సో : అది శరీరంకంటె ఎక్కువగా గౌరవించ వలసినదని అనుకుంటున్నామా ?

క్రి : అవును. ఆ సూత్రం శరీరంకంటె బాగా గొప్ప గానే గౌరవించవలసినదని అనుకుంటున్నాము.

సో : అయితే క్రిటో! అత్యధిక సంఖ్యాకులు మనల్ని గురించి ఏమనుకుంటున్నా లక్ష్యపెట్టకూడదు. కాని న్యాయా న్యాయాలు తెలుసుకున్న ఆ ఒక్క వ్యక్తే మనల్ని గురించి ఏమనుకుంటున్నాడో గమనించాలి. సత్యం ఏమంటున్నదో గమనించాలి. అందుచేత, న్యాయాన్యాయాలలోను, గౌరవా గౌరవాలలోను, మంచి చెడుగులలోను, బహుసంఖ్యాకుల అభి ప్రాయాలను గౌరవించాలని నీవు చెప్పేది పొరబాటే. అయితే ఆ అత్యధిక సంఖ్యాకులంతా ఏకమై మనల్ని చంపి వెయ్యవచ్చునని కొందరనవచ్చును.

క్రి : అవును. సోక్రటీస్! నీ సన్నదానికి అదే సరి అయిన సమాధానం.

సో : అయితే ఆ పూర్వవాదం అలాగే అచంచలంగా ఉండిపోయిందని నా కాశ్చర్యం కలుగుతున్నది. ఇక మిగిలిన విషయాలను గురించి కూడా నే నిలాగే సిద్ధాంతీకరింప వచ్చునా? కూడదా? నే నిది నిన్నడిగి తెలుసుకోవాలను కుంటున్నాను. దీనికి సమాధానం చెప్పు. సామాన్య జీవితం కన్న సజ్జన జీవితమే శ్రేష్ఠతరం. దీని కేమంటావు?

క్రి : అవును. దానికకూడా మరి తిరుగులేదు.

సో: సజ్జన జీవితం అంటే, గౌరవనీయమైన న్యాయజీవితం అవునా?

క్రి : అవును.

సో : అయితే ఈ ప్రాతిపదికలపై "ఏథెన్సు పౌరుల అనుమతి లేకుండా నే నీ కారాగారంలోనుంచి తప్పించుకొని పారిపోవడం మంచిదా? కాదా?" అనే విషయం చర్చిస్తాను. పారిపోవడమే విస్పష్టంగా న్యాయ్యమయితే పార పోవడానికి ప్రయత్నిస్తాను. లేకపోతే ఆ ప్రయత్నం విరమిస్తాను. నేనింకా మరికొన్ని సంగతు లాలోచించ వలసి ఉంటుందని అన్నావు. అవి పిల్లలకు చదువు సంధ్యలు చెప్పించడం, చెప్పించకపోతే అపకీర్తి కలగడం మొదలయినవి. ఇవన్నీ కేవలం అధిక సంఖ్యాకుల సిద్ధాంతాలు. కారణమేమీ లేకుండానే, శక్తి సామర్థ్యాలున్నంత మాత్రాన వారంతా మనుష్యులకు ప్రాణా పాయం రాకుండా రక్షిస్తారు. లేకపోతే వారి ప్రాణాలు తీయ

డానికెగబడతారు. అయితే ఈ వాదోపవాదా లింతవరకు వచ్చిన తరువాత ఇప్పుడు మన మొక విషయాన్ని గురించి ఆలోచించాలి. అప్పుడు మిగిలి ఉన్నదొకే ఒక ప్రశ్న. కారాగారంనించి పారిపోవడం గాని, లేక ఈ పారిపోవడం ద్వారా ఇతరుల సాహాయ్యం పొంది, వారికి బాధ కలిగించి, దానికి ప్రతిగా కృతజ్ఞతతో బాటు వారికి ధనం యివ్వడంగాని సముచితమా ? లేక ఆ విధంగా సహించి ఉండడమే సమంజసమా? ఈ రెండో పక్షంలో ఇక్కడ ఉండిపోవడంవల్ల వచ్చే ఆపదలు మొదలయిన వాటిని గురించి ఆలోచించకూడదు. తెలిసిందా?

క్రి : నీ వన్నది న్యాయమే. సోక్రటీస్! అయితే మన మిక ఏ విధంగా ముందుకు సాగాలి ?

సో : ఇద్దరం కలిసి ఇక ఈ విషయం పరిశీలిద్దాము. నీవు నావాదానికి అడ్డు చెప్పగలిగితే చెప్పవచ్చును. అది సరియయినదయితే నేను దానికి లోబడతాను. లేకపోతే ఏథెన్సు పౌరుల సంకల్పానికి వ్యతిరేకంగా, పారిపోవలసిందని నన్ను మాటిమాటికి ప్రోత్సహించవద్దు. ఆ విధంగా నీ విచ్చే సలహానే నెంతయినా గౌరవిస్తాను. కాని, దానికి వ్యతిరేకంగా ప్రవర్తించడమే సముచితమని తోస్తే ఆ ప్రకారమే నడుచుకుంటానుగాని నీవు చెప్పినట్లు నడుచుకోను. ఇక ఇప్పుడు నేను మొదట ప్రతిపాదించిన విషయం పరిశీలించు. నా ప్రశ్నల కే విధంగా సమాధానం ఇస్తే బాగుంటుందో ఆలోచించడానికి ప్రయత్నించు.

క్రి : సరే ! ప్రయత్నిస్తాను.

సో : మనం మనఃపూర్వకంగా ఎన్నడూ అన్యాయంగా నడుచుకో కూడదని అందామా? లేక ఒక విధంగా అయితే అలాగే నడుచుకోవచ్చుననీ, మరొక విధంగా అయితే ఆ ప్రకారంగా నడుచుకో కూడదనీ అందామా? అన్యాయంగా నడుచుకోవడం ఎప్పుడూ తప్పే అని ఇంతకు పూర్వమే అంగీకరించాము. నే నిప్పుడు కూడా ఆ మాటే అంటున్నాను. అన్యాయంగా ప్రవర్తించడం అగౌరవ హేతువని అందామా? మనం కొన్నాళ్ళకు పూర్వం కొన్ని విషయాలు న్యాయమయిన వని అంగీకరించాము. ఇప్పుడవన్నీ త్రోసివెయ్యవలసిందేనా? మనం చిన్నప్పటినుంచీ చాలా కాలంగా ఒకరొకరితో చర్చించుకుంటున్నాము. ఇప్పటి వయస్సులో చిన్నపిల్లలకు, మనకు ఏమీ భేదం లేదని గ్రహించడానికేనా అవన్నీ? నాటి రోజుల్లో అన్యాయం ఎప్పుడూ చెడ్డదే అనీ, అన్యాయంగా నడుచుకోవడం అగౌరవ హేతువనీ మన మొక యథార్థం తెలుసుకున్నాము. అధిక సంఖ్యాకులు ఏమి చెప్పినా, ఎలాంటి ఫలితాలు కలిగినా— మనం ఆ యథార్థమే అనుసరించడం మంచిదా? కాదా? ఏమంటావు?

క్రి : అవును. ఆ యథార్థమే అనుసరించడం మంచిది.

సో : అయితే తప్పుపని ఏదీ చెయ్యకూడదన్నమాట.

క్రి : నిజమే! ఎన్నడూ తప్పుపని చెయ్యకూడదు.

సో : హానికి ప్రతిహాని చెయ్యాలి అని చాలామంది భావిస్తారు, కాని మనం ఎవరికీ హానిచేయకూడదు. అవునా?

క్రి : అవును, నిశ్చయంగా ఎవరికీ హానిచేయకూడదు.

సో : అయితే సరే! క్రిటో! మరి మనం చెడుపని ఏదయినా చెయ్యవచ్చునా? చెయ్యకూడదా?

క్రి : చెడు పనులెన్నడూ చెయ్యకూడదు.

సో : చాలా మంది హింసకు ప్రతిహింస చెయ్యాలని అంటారు. అది వారినీతి. అది న్యాయమా? అన్యాయమా?

క్రి : అది న్యాయం కాదు.

సో : ఇతరుల యెడల అన్యాయంగా ప్రవర్తించడం వారిని హింసించడం వంటిదే కదా?

క్రి : అవును.

సో : అయితే ఇతరులు మనల్ని ఏ విధంగా హింసించినా వారిని తిరిగి హింసించడంగాని వారికి తిరిగి అపకారం చెయ్యడంగాని సముచితం కాదని తేలింది. క్రిటో! నీవు చెప్పేది మనః పూర్వకంగా అంటున్నావా? ఆలోచించుకో! చాలా మంది ఈ అభిప్రాయంతో ఎన్నడూ ఏకీభవించలేదు. వారెన్నడూ ఈఅభిప్రాయంతో ఏకీభవించరు. అసలు దీనితో ఏకీభవించే వారికీ, ఏకీభవించనివారికీ ప్రధాన విషయాలమీద అంగీకారం కుదరదు. తమతమ అభిప్రాయ భేదాలు స్పష్టంగా గుర్తించిన తరువాత ఉభయ పక్షాలవారు ఒకరినొకరు అసహ్యించుకొంటారు. హింసకు ప్రతిహింస చెయ్యడంగాని, తిరిగి అపకారం చెయ్యడంగాని, అన్యాయమని మొట్టమొదటి సిద్ధాంతం. ఈ సిద్ధాంతంతో నీవు ఏకీభవిస్తావా లేదా చెప్పు. మన చర్చకు ఈ సిద్ధాంతమే ప్రాతిపదిక చేసుకుందామా? లేక ఈ సిద్ధాంతంతో ఏకీభవించడానికి నీవు నిరాకరిస్తు

న్నావా? నే నింతకుపూర్వం ఇలాగే అనుకున్నాను. ఇక ముందుకూడా ఇలాగే అనుకుంటాను. లేక నీకీ విషయంలో వేరే అభిప్రాయం ఏమయినాఉంటే, ఆ అభిప్రాయ మేమిటో నాకు తెలియజెయ్యి. లేక ఈ విషయంలో నీ పూర్వాభిప్రాయం మార్చుకో లేకపోతే, నే నిక ముందడుగు వేస్తాను. ఏమంటావు?

క్రి : నా అభిప్రాయం మార్చుకోలేదు. నీ వాదం కొనసాగించవచ్చును.

సో: అయితే ఈచర్చలో యింకొక మెట్టు పైకిపోతాను. అది ఒక ప్రశ్నరూపంలో ప్రతిపాదించవచ్చును : ఒక వ్యక్తి తాను న్యాయమని నమ్మినదే ఆచరించాలా? లేక న్యాయానికి నీళ్ళు కొడాలా?

క్రి : న్యాయమని నమ్మినదే ఆచరించాలి.

సో : ఇది నిజమయితే మరి ఆచరణలోపెట్టడంఎలాగ? ఖైదు విడిచి వెళ్ళిన పక్షంలో నే నెవరికయినా అన్యాయం చేస్తున్నానా? ఒక కించిత్తయినా అన్యాయం చెయ్యగూడని వారికే అన్యాయం చేస్తున్నానా? ఖైదు విడిచి వెళ్ళిపోయే పక్షంలో మనం న్యాయమైన వని అంగీకరించిన సిద్ధాంతాలకే నీళ్ళు తోడుతున్నానా? ఏమంటావు?

క్రి : నే నేమనగలను సోక్రటీస్! నా కేమీ బోధపడడం లేదు.

సో : అయితే ఈ విషయం కొంచెం ఆలోచించు. నే నిక్కడనించి తప్పించుకుని వెళ్ళిపోతాననుకో. దీనిని గురించి

ఏమన్నా అను! ప్రభుత్వపు న్యాయసూత్రాలు మాత్రం నన్నీ విధంగా ప్రశ్నిస్తాయి.

"ఏమిటీ సంకల్పం సోక్రటీస్! నీ ఆచరణతో మమ్మల్ని కూలద్రోసి పేద్దామని ప్రయత్నించడంలేదా? వ్యక్తులు తమ ప్రభుత్వ శాసనా లుల్లంఘించి కాలద్రొక్కి వేసినప్పు డా ప్రభుత్వం కూలిపోకుండా నిలబడగలదా?"

క్రిటో! ఇటువంటి ప్రశ్నలకు మన మేమని సమాధానం చెప్పగలం? న్యాయసూత్రం ప్రకారం ఒక శిక్ష ఆచరణలో పెట్టించడానికి ఒక వక్త ఎంతయినా చెప్పవలసి ఉంటుంది. అతడు ధర్మ సూత్రా లుల్లంఘించడానికి వీలులేదని వాదిస్తా డనుకో! అప్పుడు ప్రభుత్వం మాకన్యాయంగా శిక్షవిధించి అపకారం చేసిందని సమాధానం ఇద్దామా? ఏమంటావు?

క్రి: అది చాలా చక్కగా ఉన్నది సోక్రటీస్!

సో: దానికి ధర్మసూత్రా లీవిధంగా సమాధానం ఇస్తాయి.

"నీకు, మాకు మధ్యన ఉన్న ఒప్పందం అదేనా? లేక నీవు ప్రభుత్వం విధించిన శిక్ష అనుభవించాలా?"

ధర్మసూత్రా లన్న ఈమాటలు విని నేనాశ్చర్యపడితే, ఆపైన అవి బహుశః ఈ విధంగా సమాధానం చెప్పవచ్చును.

"సోక్రటీస్! నీకు కళ్లుమూసుకొని ప్రశ్నలడగడము సమాధానాలు చెప్పడము ఒక పరిపాటి! మే మడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు! నీవు ప్రభుత్వాన్ని, మమ్మల్ని కూలద్రోయాలని చూస్తున్నావు! మామీద ఈ ధోరణి అవలం

బించడానికి నీవు ఏ విధంగా దోషారోపణ చెయ్యగలవు ? నీ అస్తిత్వానికి మేమేగదా కారణం. మా సహాయంవల్ల నీ జననీ జనకులు వివాహం చేసుకొన్నారు. వారికి నీవు జన్మించావు. ఈ విధంగా ఈ వివాహధర్మాన్ని అనుశాసించే సూత్రాల విషయంలో నీకేమయినా అభ్యంతరం ఉన్నదా?" ఈ ప్రశ్నలకు నే నేవిధమయిన అభ్యంతరము లేదని సమాధానం చెప్పాలి. మళ్ళీ ధర్మసూత్రాలు నన్నీవిధంగా ప్రశ్నించవచ్చును.

"మాలో కొన్ని ధర్మసూత్రాలు శిశువులు జన్మించిన తరువాత వారి పోషణను గురించీ, వారి విద్యాభ్యాసాన్ని గురించీ, కొన్ని నియమాలు విధిస్తున్నాయి. ఆ నియమాల ప్రకారమే నీవు సుశిక్షితుడ వయినావు. వ్యాయామంలోను, * సంగీతంలోను నీకు శిక్షణ ఇవ్వవలసిందని ఆ నియమాలు నీ జనకుని కాదేశం ఇచ్చాయి.

ఇది న్యాయమేకదా ?"

దీనికి "అవును ! ఇది న్యాయమే" అని నేను సమాధానం చెప్పాలి.

దీనిపై ధర్మసూత్రాలీ విధంగా అనవచ్చును.

"నిన్ను మేమీ ప్రపంచంలోనికి తీసుకువచ్చాము. పోషించాము. నీకు విద్యాభ్యాసావకాశాలు కలిగించాము.

* సంగీతము, వ్యాయామ శిక్షణ : గ్రీకులకు సంగీత విద్య అంటే కేవలం గానమే కాదు. 'సంగీత విద్య'లో కళలు, ఇంకా ఇతర శాస్త్రీయ విషయాలు కూడా ఉన్నాయి. గ్రీకుల కిలాంటివి తొమ్మిది విద్యలున్నాయి.

ఈ విధంగా నీవు మా సంతానమయినావు! మా సేవకుడవయినావు! ఇది కాదనగలవా? నీతండ్రి, తాతకూడ ఇలాంటివారే! ఇదే యథార్థమయితే నీవు మాతో సమాన స్థాయిలో కూర్చుని మాట్లాడడానికి వీలులేదు. మేము విధించే శిక్షకు ప్రతీకారం చెయ్యడానికి కూడా నీకు హక్కు లేదు. నిన్ను శిక్షించినందుకు నీ తండ్రినిగాని, యజమానిని గాని తిరిగి శిక్షించడానికి నీకు హక్కులేదు. అటువంటి హక్కున్నదని నీ వనగలవా? నిన్ను నాశనం చెయ్యడానికి మాకు హక్కున్నదని అనుకుంటున్నాము. ఇందుచేత దీనికి ప్రతీకారంగా మమ్మల్ని, ఈ దేశాన్ని శక్తికొద్దీ నాశనం చెయ్యడానికి నీకు హక్కున్నదా? సోక్రటీస్! నీవు సత్ప్రవర్తనల గల గొప్ప వ్యక్తివి. ఈ విధంగా మమ్మల్ని నాశనంచేసే హక్కు నీకున్నదని భావిస్తున్నావా? మన తల్లిదండ్రుల కన్న, పూర్వుల కన్న మాతృదేశం గౌరవింప దగినదని – గొప్ప తత్త్వవేత్తవు – నీవు గుర్తింపలేదా? దేశానికి నీ మీద ఆగ్రహం కలిగినపుడు, తల్లిదండ్రుల కన్న ఎక్కువ గౌరవ భావంతో బతిమాలుకోవాలి. ఒకవేళ దానివల్ల ఫలితం కలగకపోతే మాతృదేశ శిక్ష శిరసా వహించాలని నీకు తెలియదా? స్వదేశం కారాగార శిక్ష విధించినా కశాఘాత శిక్ష విధించినా కిమ్మనకుండా భరించాలి. ఒకవేళ స్వదేశం యుద్ధంలోనికి వెళ్ళి, గాయాలను, మృత్యువునుకూడా లక్ష్యపెట్టకుండా పోరాడవలసిందని ఆజ్ఞాపించినా అది శిరసా వహించడం విధ్యుక్త ధర్మమని భావించాలి. శత్రువులకు లొంగిపోయి వెన్నిచ్చి పారిపోకూడదు. యుద్ధ రంగంలో

నయినా, న్యాయస్థానంలో నయినా, ఇంకొక చోటయినా తన నగరము, దేశము ఆజ్ఞాపించిన విధంగానే ప్రవర్తించాలి. లేకపోతే న్యాయ సూత్రాల విషయంలో స్వీయ నగర వాసుల అభిప్రాయాలు గాని, స్వదేశీయుల అభిప్రాయాలు గాని మార్చాలి. తల్లిదండ్రులకు వ్యతిరేకంగా ప్రతి హింస చేయకూడదనుకున్నప్పుడు, తన దేశానికి వ్యతిరేకంగా ప్రతి హింస చెయ్యకూడదని వేరే చెప్పనక్కర లేదు కదా!"

దీనికి మనమే విధంగా సమాధానం చెప్పాలి క్రిటో. ధర్మసూత్రాలు నిజం చెబుతున్నాయంటావా? లేదంటావా?

క్రి : అవి నిజమే చెబుతున్నాయి.

సో : ఆ పైన ధర్మసూత్రాలిలాగ అనవచ్చును.

"సోక్రటీస్! మేము చెప్పినది నిజమయితే,–నీవిప్పుడు మాకు విఘాతం కలిగించడానికి ప్రయత్నిస్తున్నావు. మేము నిన్ను ప్రపంచంలోనికి తీసుకు వచ్చాము. పోషించాము. చదువు చెప్పించాము. నీకు, ఇంకా ఎందరెందరో ఏథెన్సు పౌరులకు అనేకమైన సౌకర్యాలు కలిగించాము. ఇంకా అనేకమయిన స్వాతంత్ర్యావకాశా లేర్పాటు చేశాము. అందుచేత యుక్త వయస్కులయిన ఏథెన్సు పౌరులందరిని మేమీ విధంగా ఆజ్ఞాపిస్తున్నాము." ఏథెన్సు పౌరులలో ఎవరికైనా మా ధోరణి, నగర సంప్రదాయాలు నచ్చకపోతే వారు తమతమ సామగ్రులతో సహా చిత్తంవచ్చిన చోటికి వెళ్ళిపోవచ్చును. మేము వారికి అడ్డంకులు కలిగించము. మేమన్నా, ఏథెన్సు నగర సంప్రదాయాలన్నా ఇష్టంలేని

ఏథెన్స్ నగర పౌరులు, ఏ వలస కయినా, మరి ఏ నగరాని కయినా వెళ్ళిపోదలచుకుంటే తమ ఆస్తులతో సహా తరలిపో వచ్చును. కాని మా న్యాయ పరిపాలన, నగరపరిపాలన విధానాలు తెలిసీ ఇక్కడే ఉండిపోయిన వ్యక్తి మా ఆజ్ఞ ప్రకారం నడుచుకుంటాననే ఒప్పందానికి అంగీకరించాడన్న మాట. ఈ పరిస్థితులలో మా ఆజ్ఞ వ్యతిరేకించిన వ్యక్తి మూడు విధాల తప్పుడు దారులు తొక్కుతున్నాడని అంటు న్నాము. మా ఆజ్ఞలకు వ్యతిరేకంగా నడుస్తున్న వ్యక్తి తన తల్లిదండ్రులకు వ్యతిరేకంగా నడుచుకుంటున్నాడు. ఇది మొద టిది. అతని విద్యాభ్యాస బాధ్యత మాదే కనక వ్యతిరేక ప్రవర్తన ద్వారా ఆ వ్యక్తి ఈ విధంగాకూడా తప్పుడు మార్గంలో ప్రవేశిస్తున్నాడు. ఇది రెండవది. ఇక్కడ ఉన్న ప్పుడు మా ఆజ్ఞప్రకారం నడచుకుంటాననే ఒప్పందానికి అంగీకరించాడు కనక, అతడు దీనికి కూడా వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాడు. ఇది మూడవది. అటువంటి వ్యక్తి మా ఆజ్ఞప్రకారం నడుచుకోవడము లేదు; లేక మా ఆజ్ఞలు అన్యాయమయినవని మాకు నమ్మక కలిగించడమూ లేదు. ఈ ఆజ్ఞలు మేము బలాత్కారంగా విధించడం లేదు. మా ఆజ్ఞ ప్రకారం నడుచుకో వలసిందనీ, లేకపోతే ధర్మ సూత్రా లన్యాయ మయినవనీ నిరూపించవలసిందనీ, అంటున్నాము. మా ఆజ్ఞలకు వ్యతిరేకించే వ్యక్తి ఈ రెండింటిలోనూ ఏదీ చెయ్యడంలేదు. ఏథెన్సుపౌరు లందరిలోను, ప్రత్యేకంగా నీవు స్వేచ్ఛాప్రకారమే ప్రవర్తించే పక్షంలో ఈ విధమయిన నిందారోపణల కన్నిటికీ పాత్రుడవవుతున్నావు."

అని ధర్మసూత్రా లనవచ్చును. ఒకవేళ నేను "ఏథెన్స్ పౌరులందరికన్నా నాలో వేరే ప్రత్యేకత ఏమి ఉన్నది?" అని ప్రశ్నించా ననుకో! అప్పుడు మిగిలిన ఏథెన్స్ పౌరులందరి కన్నా ప్రత్యేకంగా– ధర్మ సూత్రాల ప్రకారం నేను నడచుకుంటాననే ఒప్పందానికి అంగీకరించానని ధర్మసూత్రాలు న్యాయంగానే ప్రత్యుత్తరం ఇవ్వవచ్చును. ధర్మసూత్రాలింకా ఈ విధంగా చెప్పవచ్చును.

"సోక్రటీస్! మేమీవిధంగా మాట్లాడడానికి స్పష్టమయిన నిదర్శనం ఒకటి ఉన్నది. మేముగాని, ఏథెన్స్ నగరంగాని నీకే విధంగానూ అసంతుష్టి కలిగించలేదు. ఏథెన్స్ పౌరులందరి కన్నా నీవే నిత్యమూ ఈ నగరంలో నివసిస్తున్నావు. నీ విది ఎన్నడూ విడిచి వెళ్ళలేదు; కనుక నీకీ పట్టణం అంటే ఎంతో మక్కువ అని ఊహించుకో వచ్చును. ఒకప్పుడు క్రీడా వినోదాలు సందర్శించడానికి కోరింథ్ జలసంధి * ప్రదేశానికి వెళ్ళావు. ఆ పైన సైన్యంలో పనిచేసినప్పుడు మాత్రమే నీవీ నగరం విడిచి వెళ్ళావు. ఇక మరెప్పుడూ ఇది విడిచి వెళ్ళలేదు. అదీగాక, మిగిలిన వారిలాగ నీవు దూర ప్రదేశాలు సందర్శించడానికి యాత్రలేవీ చెయ్యలేదు. మిగిలిన రాష్ట్రాలుగాని, ఆయా రాష్ట్రాల ధర్మసూత్రాలుగాని, చూడాలనీ, అవగాహన చేసుకోవాలనీ, నీ కెప్పుడూ జిజ్ఞాసకూడా కలగలేదు. నీ ఆదరాభిమానాలెప్పుడూ ఈ రాష్ట్రం విడిచి పైకి పోలేదు. మా

* కోరింథ్ జలసంధి సమీపంలో జల ప్రదర్శనాలు, గుర్రపందాలు, కవిత్వంలోను గానంలోను పోటీ జరిపేవారు. రెండేళ్ళ కొక మారివి జరుగుతూ ఉండేవి.

యందు నీ కెంతో అభిమానం ఏర్పడింది. మా పరిపాలన నీ వంగీకరించావు. ఈ ఏథెన్సు నగరంలోనే నీకు సంతానం కలిగింది. ఇక్కడ సుఖంగా ఉన్నావనడానికి ఇదిఒక నిదర్శనం. ఇంకొక విషయం. నీ మీాది అభియోగం విచారణజరిగే సందర్భంలో, ఇష్టమైతే ఏథెన్సు నగరం నించి నిర్వాసనం శిక్షగా విధింపవచ్చునని కోరి ఉండవచ్చును. ఇప్పుడు నీ విక్కడినుండి వెళ్లిపోడానికి అంగీకరించని ఏథెన్సు నగర రాష్ట్రం ఆ సమయంలో అయితే- నీ కోరిక అంగీకరించే ఉండేది. కాని ఆ సమయంలో నీవు నిర్వాసనం కంటె మరణమే మంచి దన్నట్లుగా నీ అభిప్రాయం వ్యక్తం చేశావు. మరణించడం నీ కిష్టమే అన్నట్లు మాట్లాడావు. ఇప్పుడా అభిప్రాయాలన్నీ మరిచిపోయావు. మమ్మల్ని గౌరవించకుండా సర్వనాశనం చేస్తున్నావు! ఏథెన్సునగర పౌరుడుగా ఉంటూ నీవు మాతో కొన్ని ఒప్పందాలు చేసుకున్నావు. అటువంటివాడ విప్పుడొక నీచ దాసజాతి వ్యక్తిలాగ ఆ ఒప్పందాలన్నీ మంట గలిపి పారిపోవాలని ప్రయత్నిస్తున్నావు. కేవలం మాటలతోనే గాక చేతలతో కూడా మా పరిపాలనకు నీ వంగీకరించావు. మే మన్నది నిజమా ? అబద్ధమా ? ముందుగా ఈ ప్రశ్నకు సరియయిన సమాధానం చెప్పు ?"

ఇలాఅంటే, మన మేమని సమాధానం చెప్పాలి క్రిటో! తప్పకుండా నిజమే అని అంగీకరించాలి గదా!

క్రి : అవును సోక్రటీస్! మనం అంతకంటె చెయ్యవలసిందేమీా లేదు.

సో : ఆపైన ధర్మసూత్రాలు తిరిగి ఈ విధంగా ప్రశ్నించి తీరతాయి.

“సోక్రటీస్! నీవెంతో ప్రశాంతంగా అన్నీ ఆలోచించుకొన్న మీదటే మాతో కొన్ని ఒప్పందాలు, నిర్ణయాలు చేసుకున్నావు! అంతేగాని తొందరపడిగాని, నిర్బంధం మీదగాని, మోసపడి గాని, ఈ ఒప్పందాలకు, నిర్ణయాలకు అంగీకరించలేదు. డెబ్బయి ఏళ్ళపాటు నీకు వీటి మంచిచెడ్డలను గురించి ఆలోచించి నిర్ణయించడానికి అవకాశం ఏర్పడింది. ఈ కాలంలో నీకీ ధర్మసూత్రాలు, నిర్ణయాలు నచ్చి ఉండక పోతే, లేక ఇవి అన్యాయంగా ఉన్నాయని తోచి ఉంటే, ఈ నగరం విడిచి వెళ్ళడానికి స్వాతంత్ర్యం ఉండనే ఉన్నది. ఆ వెళ్ళబోయే ప్రదేశం ఎన్నుకోవడానికి కూడా నీకు స్వాతంత్ర్యం ఉన్నది. లాసిడీమన్‌కు గాని, క్రీట్‌కు గాని నీవు వెళ్ళి ఉండవచ్చును. ఈ రెండు ప్రదేశాలలోను పరిపాలన చక్కగా ఉన్నదని అనేక మారులు ప్రశంసించావు. లేక మరి ఒక గ్రీసు రాష్ట్రానికిగాని, విదేశానికి గాని వెళ్ళి ఉండవచ్చును. కాని ఏథెన్సు పౌరులందరికన్నా నీ వీ రాష్ట్రం, అంటే ఎంతో అభిమానం ఉన్నట్లు కనిపించావు. అంటే మామీద ఎంతో మక్కువ ఉన్నట్లు కనిపించావు. అసలు ధర్మసూత్రాలే లేని రాష్ట్రం అంటే ఎవరికి మాత్రం ఎలా ఇష్టం ఉంటుంది. నీవీ రాష్ట్రం విడిచి ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళనేలేదు. వికలాంగుల కన్నా ఎక్కువగా ఈ రాష్ట్రంలోనే స్థిరపడి పోయావు. ఈ పరిస్థితులలో స్వయంగా చేసిన ఒప్పందాలన్నీ తుడిచిపెట్టి పారిపోవాలని అనుకుంటున్నావు. సోక్రటీస్! మా సలహా విన

దలచుకుంటే ఈ నగరం విడిచి పారిపోవద్దు! నలుగురిలోను నవ్వులపాలై పోవద్దు! కొంచెం జాగ్రత్తగా ఆలోచించుకో! ఈవిధంగా మన్నాల్ని అతిక్రమించి తప్పుదారి తొక్కితే దీని వల్ల నీకుగాని, నీ మిత్రులకు గాని ఏవిధంగా మంచి జరుగుతుంది? నీవు పారిపోయే పక్షంలో నీ స్నేహితుల నందరినీ ఈ రాష్ట్రం నుంచి తరిమివెయ్యడము, వారి పౌరసత్వాలు తొలగించి వెయ్యడము నిశ్చయమే. లేక వారి ఆస్తులు పోవడం కూడా చాలా వరకు జరిగేదే. నీ మట్టుకు నీవు నీ ఇరుగు పొరుగు రాష్ట్రానికయినా, అంటే థీబ్స్ రాష్ట్రానికి గాని, మెగారా రాష్ట్రానికి గాని- పారిపోయావని అనుకో! ఆ రెండు రాష్ట్రాలలోను పరిపాలన ప్రశస్తంగానే ఉన్నది. కాని ఆ రాష్ట్రాలలో నీ వొక శత్రువుగానే ప్రవేశిస్తావు. సోక్రటీస్! నీ యెడల ఆ రాష్ట్రాల ప్రభుత్వాలు వ్యతిరేకంగానే ప్రవర్తిస్తాయి. ధర్మసూత్రాలు వ్యతిరేకంగానే ప్రవర్తిస్తాయి. ధర్మసూత్రాల యెడల విరుద్ధంగా ప్రవర్తించావనే దృష్టితో ఆ రాష్ట్రాలలో దేశాభిమానులయిన ప్రజలంతా నీ కపకారిమే తలపెడతారు. నీకు శిక్ష విధించిన న్యాయాధికారులందరికీ ఆ శిక్ష విధించడం న్యాయమే అనే అభిప్రాయం బలపడుతుంది. ధర్మ సూత్రాల ధ్వంసం చేసిన వ్యక్తికి మానవులలో అభంశుభం తెలియని వారినీ, యువకులనూ తప్పుదారి పట్టించే అవకాశాలెక్కువ. అయితే నీ వీ ధర్మబద్ధంగా ఉన్న నగరాలను, సత్పురుషులను తప్పించుకొని పారిపోవాలనే ఆలోచిస్తున్నావా? ఆ పరిస్థితులలో ఆ విధంగా జీవితం సాగించడం సముచితమేనా? లేక మానాభిమానాలు

విడిచి ఆ నగరాలలో జనం మధ్య నిలబడి ప్రసంగా లలాగే సాగించాలని, అనుకున్నావా ? వారితో నీ వేమని ప్రసంగిస్తావు? మానవులలో సద్గుణాలు న్యాయము, సంస్థలు సర్వోత్తమ మయినవే గదా! అయితే మరి ఈ విధంగా తప్పించుకుని పారి పోవడం న్యాయమేనా ? నిశ్చయంగా నీ కిది న్యాయంకాదు సోక్రటీస్! క్రిటో మిత్రులు నివసించే థెసాలీ రాష్ట్రంలో జనం యథేచ్ఛగా సంచరిస్తారు. అక్కడి పరిస్థితిఅంతా ఒక నీతి, నియమము లేకుండా ఉన్నది. ధర్మబద్ధమయిన రాష్ట్రంలో నుంచి తప్పించుకొని అక్కడికి పారిపోతే కారాగారంలో నుంచి తప్పించుకొని వచ్చిన నీ వింత గాధ విని వారానం దించవచ్చును. మేక చర్మమో మరేదో కప్పుకొని, పారి పోయేవారు వేసుకొనే మారువేషం వేసుకొని, నలు గురూ నవ్వే ధోరణిలో నీ వక్కడికి వెళ్ళిన సంగతి వింటే, వారికి కొంత విచిత్రంగా కనిపించవచ్చును. అయితే – ఈ వృద్ధాప్యంలో కూడా ఇంకా కొంత కాలం జీవించాలనే క్షుద్ర కాంక్షతో పరమ పవిత్రమయిన ధర్మసూత్రా లుల్లంఘించ డానికికూడా సంకోచించడం లేదని నీ కక్కడ జ్ఞాపకంచేసే వా రొక్కరుకూడా ఉండరంటావా ? అక్కడివారి నెలాగో అలాగ కొంచెం మంచి చేసుకుంటే, బహుశః అటువంటి వా రెవరూ తటస్థపడక పోవచ్చును. కాని వారి కెప్పుడయినా కోపంవస్తే అవమాన కరమయిన మాటలెన్నో వినవలసి వస్తుంది. అక్కడ ఎలాగో అలాగ కాలం వెళ్ళబుచ్చు కుంటావే అనుకో. అయితే అది ఎలాగ గడుస్తుంది ? అక్కడ ఉన్నవారి నందరినీ పొద్దస్తమానము పొగడుతూ కూర్చొ

వాలి. అందరికీ చాకిరీచేస్తూ నౌఖరుగా ఉండాలి. నీ ఇక్కడ చేసే పని ఏమిటి? థెసాలీలో ఏదో ఇంత తినడం, తాగడం. కడుపు కక్కుర్తి కోసమని థెసాలీకి వెళుతున్నానన్న మాట! మరి న్యాయాన్యాయాల గురించీ, సద్గుణాలను గురించీ నీవు చేసే ధర్మోపదేశాలన్నీ ఏమవుతాయి? నీ సంతానం కోసం జీవిస్తున్నాననీ, వారిని పెంచి పెద్దవారిని చేసి, చదువు సంధ్యలు చెప్పించడానికి జీవిస్తున్నాననీ అంటావా? అయితే నీ పిల్లల ఏథెన్స్ పౌరసత్వపు హక్కు థెసాలీకి తీసుకుపోవాలనుకున్నావా? వారికి నీవుచేసే ఉపకారం ఇదేనా? లేక పిల్లల దగ్గిర ఉండకపోయినా, బ్రతికి ఉంటే ఇక్కడ నీ స్నేహితులు వారి నెంతో జాగ్రత్తగా చూస్తారనీ చదువు సంధ్యలు చెప్పిస్తారనీ అనుకుంటున్నావా? థెసాలీలో ఉంటేనే నీ మిత్రులు నీ సంతానం మంచిచెడ్డలు కనిపెట్టి చూస్తారనీ, పరలోకానికి వెడితే మరి వారు నీ సంతాన యోగక్షేమాలు కనిపెట్టి చూడరనీ అనుకుంటున్నావా? అది సరిఅయిన ఊహ కాదు. స్నేహితులన్న వారు ఏ పరిస్థితులలో నయినా స్నేహితులుగానే ఉంటారు. వారు తప్పకుండా నీ సంతానం విషయంలో జాగ్రత్త వహిస్తారు. సందేహం లేదు."

"సోక్రటీస్! నిన్ను చిన్నప్పటినుంచీ పెంచి పెద్దవాణ్ణి చేసిన మేము చెప్పేది జాగ్రత్తగా విను! ముందుగా నీ జీవితాన్ని గురించీ, పిల్లల్ని గురించీ ఆలోచించి, ఆ తరువాత ధర్మాన్ని గురించి ఆలోచించకు. అది న్యాయ్యంగా కాదు. ముందుగా నీ ధర్మాన్ని గురించే ఆలోచించు! దీనివల్ల ప్రపంచ

పరిపాలకులందరి ముందు నీవు చేసినది న్యాయంగా కనిపిస్తుంది. వారంతా నీవు చేసినది న్యాయమయినదని అనుకోవాలంటే అదే మార్గం. క్రిటో చెప్పినట్టుగా చేసిన పక్షంలో నీ జీవితంలో గాని, జన్మాంతరంలో గాని, నీవుగాని, నీ వారు గాని న్యాయంగా ప్రవర్తించామనీ, దోషరహితులమనీ, భావించి ఆనందింపజాలరు. ఇప్పుడు మేము విధించిన శిక్షకు తలఒగ్గి అన్యాయకంగా నిష్క్రమించానను కో! ఇందువల్ల నీవు శిక్ష అనుభవించి బాధపడుతున్నావు గాని, తిరిగి ప్రతి హింస చెయ్యడం లేదు. మానవులే నిన్ను హింసిస్తున్నారు గాని, ధర్మం నిన్ను హింసించడం లేదు. అలాగ కాకుండా హింసకు ప్రతిహింస చేసి, ఇక్కడనుండి పారిపోయావనుకో! అప్పుడు మాతో చేసుకొన్న ఒప్పందాలు నిర్ణయాలు— అన్నీ భగ్నం చేస్తున్నావు! అపకారం చెయ్యడానికి అనర్హులయిన వారికే అపకారం చేస్తున్నావు. అంటే, నీకు నీ మిత్రులకు, నీ దేశానికి, మాకు అపకారం చేస్తున్నావన్నమాట. దీనివల్ల నీవు జీవించి ఉన్నంతకాలము మేము నీయెడల విరోధం వహిస్తాము. మమ్మల్ని నాశనం చెయ్యడానికి నీవు శాయశక్తులా ప్రయత్నించడంవల్ల మానవ ప్రపంచంలో మాతోడబుట్టువులయిన ధర్మసూత్రాలన్నీ నిన్ను శత్రువులుగానే భావిస్తాయి. అందుచేత మేము చెప్పినట్టే నడుచుకో! క్రిటో చెప్పినట్టు వినకు!"

ఒక భగవద్భక్తుని హృదయంలో మురళీ ధ్వని మాగ్రమోగినట్లే ఇదంతా నా హృదయంలో మంద్ర మంద్రంగా మారు మోగుతున్నది. ఈ వాణి నా శ్రుతి కుహ

రాల్లో నెమ్మది నెమ్మదిగా ప్రతిధ్వనిస్తూ మరొకటి ఏదీ వినరీయడం లేదు! ఇక ఈపైన నీ వేమిచెప్పినా, అది ఎందుకూ కొరగాకుండా పోతుందని నే నెరుగుదును. అయినా నీ కింకా ఏ మయినా చెప్పవలసినది ఉంటే చెప్పవచ్చును క్రిటో!

క్రి: సోక్రటీస్! మరి నేను వేరే చెప్పవలసిన దేదీ లేదు.

సో: అయితే పరమేశ్వరుని ఇచ్ఛాప్రకారం నడుచుకో డానికీ, ఆయన ఎటు నడిపిస్తే అటునడవడానికీ నన్ను పోనీయి నాయనా!